# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

137/138 మాసపత్రిక మార్చి/ఏప్రిల్ 1983



నిర్వాహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

అనివార్యకారణాలవల్ల మార్చి, ఏప్రిల్ సంచికలు కలిపి ఒకే సంచికగా 72 పేజీలు మాత్రమే వెలువరిస్తున్నాం. మే సంచిక ఇంద్రవెల్లి మృతవీరుల సంస్మరణ (ఏప్రిల్ 20), మేడే, మార్క్స్ జయంతి (మే 5) లను పురస్కరించుకొని ఎక్కువ పేజీలతో ప్రత్యేక సంచికగా మేడేనాటికి వెలువడుతుంది. పాఠకులు గమనించ ప్రార్థన.

— 'సాహితీ మిత్రులు'

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22 9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor : Varavararao

# మార్క్సిజం - రివిజనిజం

లండన్‌నుండి వార్త. ప్రపంచవ్యాప్తంగా అన్నిదేశాలలోనూ జరిగినట్టే టన్‌లోనూ మార్క్సు శతవర్ధంతి జరిగింది. మార్క్సు సమాధివద్ద బ్రిటిష్ మ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన ఒక వందమంది కామ్రేడ్లు గుమిగూడారు. చనిపోయిన రికి శ్రద్ధాంజలి ఘటించేటప్పుడు వారి సమాధిదగ్గర బైబిల్‌నుండి కొన్నివాక్యాలు వడం క్రిశ్చియన్ల ఆచారం. ఆ ప్రకారమే బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ నాయకు కడు దాస్‌కాపిటల్‌నుండి కొన్నివాక్యాలు బిగ్గరగా చదివాడట. అక్కడ గుమి డిన జనమంతా అవనతవదనులై (ఇది నా ఊహామాత్రమే, వార్తలో భాగంకాదు) వాక్యాలువిని, నిశ్శబ్దంగా నిష్క్రమించారట.

ఇదీ ఇవాల్టి వాతావరణం. చేనుకు పురుగుపడితే ఒకటిరెండు మొక్కలకు త్రమే పట్టక ఎకరాలకు ఎకరాలు తినేస్తుంది. అట్లాగే రివిజనిజం పురుగు అన్ని లలోనూ కమ్యూనిస్టు ఉద్యమాన్ని తినేస్తోంది. రివిజనిజంగా మారిన మార్క్సిజం బడీ వర్గాలకు మచ్చికఅయింది. వాళ్ళకు మార్క్సుఅంటే భయంపోయింది. సెంబ్లీలు, పార్లమెంటులు, మార్చి 14న మార్క్సును శాస్త్రోక్తంగా స్మరించాయి. పేశ్‌గుప్తా లేడుగాని, బ్రతికేవుంటే ఆయనగారి సంస్మారక వాగ్ధాటికి రాజ్య లో కన్నీటికి తడవని కళ్లుండేవికావు. హైదరాబాద్‌లో స్వామి రంగనాథానంద డి మాస్కోలో మాజీ పోలీసుఅధికారి ఆండ్రొపోవ్ వరకు, అందరూ మార్క్సు వాడేనన్నట్టూ, ఆయన సిద్ధాంతామృతసారాన్ని తామే కాచివడబోసినట్టూ, సందేశా చ్చారు. ఒకడు ఫ్యూడల్, ఒకడు సామ్రాజ్యవాది. వీళ్లిద్దరికీ మార్క్సును స్మరిం త ధైర్యం వచ్చిందంటే ఆపురుగు ఎంతలోతుగా నమిలేసిందో అంచనా సుకోవచ్చు.

విశ్వవిద్యాలయాలలోనూ వర్ధంతిసభలు జరుగుతాయి. పి. హెచ్. డీ పట్టాల వేటలో మార్క్సును మారకపు సరుకుగా మార్చేసిన మేధావులు ఆయన గురించి న్యాసాలు దంచుతారు. వాళ్ళకు తమ సిద్ధాంతవ్యాసాలను టైపుచేసే టైపిస్టుల మపట్ల ఏపాటి గౌరవముందో, ఆ వ్యాసాలకు సిద్ధాంతాన్ని సమకూర్చిపెట్టిన మార్క్సు న్నా అంతేగౌరవం వుంది. నిజానికి, 'సిద్ధాంతపరంగా విమర్శించడం, ఆచరణలో వీకరించడం' అనే రెండు కర్తవ్యాలను (to critise in theory and revolu. nise in practise) విడగొట్టడం తెలీని మార్క్సుకు, 'మార్క్సిస్టుమేధావి' అనే టే బహుశా రుచించేది కాదేమో. ఆ రెండు కర్తవ్యాలనూ విడగొట్టి మొదటిదాన్ని

అకడెమిక్ హోదాల వేటకు లోబరిచారు. మార్క్సిజం నుండి విప్లవాన్ని తొలగించారు. 1913 లో లెనిన్ 'బూర్జువా సైన్సుకు మార్క్స్ భావాలంటే విపరీతమయిన విరోధం, ద్వేషం' అన్నాడు కాని, ఆలోచననూ ఆచరణనూ విడగొట్టిన తరువాత ఆ భయం పోయింది. బూర్జువా యూనివర్సిటీలలోకి మార్క్స్‌ను సాదరంగా ఆహ్వానించి వర్ధంతి సందర్భంగా సత్కరిస్తున్నారు గూడ. బూర్జువా పత్రికలు సహితం ఆ పరవడిని స్పష్టంచేస్తూ మార్క్స్ మీద సంపాదకీయాలు రాస్తున్నాయి. ఆయన చెప్పిన విప్లవం అబద్ధంగాని, ఎంతటిమేధస్సు, ఎంతటి మానవీయత, ఏమాసామాజిక విశ్లేషణాతత్పరత అని కీర్తిస్తున్నాయి.

అందుకే ఇవ్వాళ మార్క్స్‌ను స్మరించుకోవాలంటే విప్లవాచరణ గురించి మాట్లాడుకోవాలి. నానారకాల రివిజనిజం మార్క్సిజం నుండి తొలగించివేసిన సజీవ విప్లవాచరణను తిరిగి తన స్థానానికి చేర్చాలి. ఆచరణ, మార్పు, ఆలోచనాపూర్వకమయిన విధ్వంసన, నిర్మాణం. వీటికి మార్క్స్ సిద్ధాంతంలోవున్న కేంద్రస్థానం ఆయన రచనలలో అడుగడుగునా కనిపిస్తుంది. సోవియట్ రివిజనిస్టుల ప్రభావాన మనం చరిత్రను అమూర్తమయిన, నిర్జీవమయిన, ఉత్పత్తిరంగంలోని వైరుధ్యాల సంఘర్షణ ఫలితంగా చెప్పుకుంటున్నాము. ఆ వైరుధ్యాలు పరిష్కారం కావాలంటే సామాజికరూప తీసుకోవాలనీ, సామాజికరూపం తీసుకోవడమంటే వర్గవైరుధ్యం రూపంతీసుకోవడమనీ, ఆ వైరుధ్యాల సంఘర్షణ వర్గసంఘర్షణ రూపం తీసుకుంటుందనీ, చెప్పడం అప్రధానమయిపోయింది. పెట్టుబడిదారీ సమాజంలో సామాజిక రూపంతీసుకున్న ఉత్పత్తి (social prodnction) వ్యక్తిస్వామ్యం (private appropriation) ఆటంకమయిందని చెప్పినంతగా, ఆ ఆటంకం, అందులో ఉన్న వైరుధ్యం, కార్మికవర్గ పోరాటానికీ, కార్మిక నియంతృత్వానికీ, అనివార్యంగా దారితీస్తుందని చెప్పడంలేదు. అందుకే పబ్లిక్ సెక్టర్ అంటే సోషలిజం అని అనుకోగలుగుతున్నారు కొందరు అమాయకులు. వర్గపోరాటమంటే భయపడడం రివిజనిజానికి సహజం. అది సామాజిక మార్పును వీలయినంత నిర్జీవంగాను, యాంత్రికంగాను, చిత్రీకరిస్తుంది. మనుషులు, వాళ్ళఆచరణ, వర్గపోరాటం, ఆ నిర్జీవమయిన పునాదిపైన యాంత్రికంగా నిర్మితమవుతాయి. సోవియట్ రష్యా నుండి వెలువడే మార్క్సిస్టు భాష్యగ్రంథాలు అందుచేతనే అంతపేలవంగా ఉంటాయి. వాటిని చదవడం కష్టం, చదివి ఉత్తేజితులు కావడం అసాధ్యం.

“ఇదివరకు భౌతికవాదం ప్రపంచాన్ని తన ఆలోచనకు ఒక బహిర్వస్తువు (object) గా మాత్రమే భావించిందిగాని, ఆచరణగా, సజీవమయిన మానవకృషిగా, భావించలేదు” అని మార్క్స్ అన్నాడు. ఆలోచన కేవలం ప్రపంచాన్ని ప్రతిఫలించేది మాత్రమేకాదు, ఆ ప్రపంచాన్ని మార్చే ఆచరణను ప్రేరేపించేదిగూడ. అదికేవలం ప్రపంచాన్ని ప్రతిఫలించి ఊరుకుంటే, ఆదిమకాలంనుండి ఈనాటి

దాకా ఈ ప్రపంచంలో వచ్చినమార్పులు సంభవించి ఉండేవేకావు. అడవులుపోయి
పొలాలు, పొలాలుపోయి కార్ఖానాలు, ప్రకృతిసిద్ధంగారాలేదు. మానవ ఆచరణ
ఫలితంగా వచ్చాయి. చైతన్యం ప్రపంచాన్ని ప్రతిఫలిస్తుంది, దానిధర్మాలను అర్థం
చేసుకుంటుంది, ఆ అవగాహనను అనుసరించి ప్రపంచాన్ని మారుస్తుంది. ఆ
మార్పును సాధించేది ఆచరణ. చైతన్యానికీ నిర్జీవమయిన భౌతిక ప్రపంచానికీ
మధ్య సంధానంకుదిర్చేది ఆచరణ. "పరిసరాలు మనిషిని రూపొందిస్తాయనీ, కాబట్టి
మనిషి మారాలంటే పరిసరాలు మారాలనీ, చెప్పే భౌతికవాదసిద్ధాంతం, ఆ పరిసరా
లను మార్చేది మనిషేనన్న విషయాన్ని మరచిపోయింది" అని మార్క్స్ అన్నాడు.
పదార్థమే ప్రధానం, చైతన్యం తద్భవం. పదార్థం ప్రతిబింబంతప్ప చైతన్యంలో
ఏమీఉండదు. అయితే ఆ ప్రతిఫలన యాంత్రికమయినదీ, నిర్జీవమైనదీకాదు.
విశ్లేషణాత్మకమయినది, విమర్శనాత్మకమయినది, ఆచరణాత్మకమయినది, ని
ణాత్మకమయినది. ఆ ఆచరణ భౌతికమే, ఆ నిర్మాణంభౌతికమే. చైతన్యం
ప్రపంచంలో భాగంకాదుగాని, చైతన్యమయిన ఆచరణ పదార్థ ప్రపంచంలోభాగ

ఇవి అందరికీ తెలిసినవిషయాలే. కాని పదేపదే చెప్పుకోవలసి వస్తో
'పరిస్థితుల'నుండి మానవ ఆచరణను వేరుచేసి, 'పరిస్థితులు' అనేవి తమంతట
పరిపక్వమయిన తరువాతే విప్లవఆచరణ ప్రారంభమవుతుందనే ఆలోచనను
నిస్టులు ప్రచారంచేస్తున్నారు. మెన్షెవిక్కులనుండి ఈనాటి ఆధునిక రివిజనిస్టుల
అందరూచేసిన పనే ఇది. భౌతికపరిస్థితులలో మానవ ఆచరణ ఒక భాగమనీ,
పరిస్థితులు పరిపక్వంకావడంలో మానవ ఆచరణ పాత్రవుందనీ, గుర్తించదు
నిజం. సామాజిక-ఆర్థికసంక్షోభం తీవ్రతరం కావడంవల్ల నక్సల్బరీ జరిగి
అకడెమిక్ మార్క్సిజం గుర్తించిందిగాని, నక్సల్బరీ జరగడంవల్ల ఆ సంక
మరింత తీవ్రతరమయిందని గుర్తించలేదు.

వైజ్ఞానిక-పారిశ్రామిక రంగంనుండి చక్కటి ఉదాహరణలు దొరుకుత
ఇవ్వాళ రసాయనిక ఎరువులు విస్తృతంగా వాడుతున్నాము. వాటిఅవసరం ఈ
వరకు ఏర్పడలేదు. సారవంతమయిన బీడుభూములు ఖాళీగా పడివున్నంతకాలం
వుల అవసరం ఎక్కువగా ఉండదు, ఉన్నంతమేరకు ప్రకృతిసిద్ధమయిన ఎర
సరిపోతాయి. సారవంతమయిన భూములన్నిగూడ (దాదాపుగా) పంటకిందికి వ
తరువాతే, అంటే ఈ శతాబ్దిలోనే, భూసారాన్ని మరింత పెంచే కృత్రిమఎరువుల
సరం అయ్యాయి. రసాయనిక ఎరువులు కనిపెట్టబడ్డాయి. అయితే ఆ అవసరం
తనంతటతాను ఈ ఆవిష్కరణకు దారితీయలేదు. అవసరంవేరు, అవకాశంవేరు. ఆ
అవసరం ఆసన్నంకావడానికి గత రెండుమూడు శతాబ్దాల వైజ్ఞానిక-పారిశ్రామిక పరి

శోధన. ఆచరణ- దోహదంచేసాయి. ఆ ఆచరణేలేకుంటే, కృత్రిమ ఎరువుల అవసరం తనంతటతాను రసాయనిక ఎరువుల ఆవిష్కరణకు దారితీసి ఉండేదికాదు. విస్తృతమయిన క్షామానికి దారితీసి ఉండేది. నిరంతరం మారేప్రపంచాన్ని దాని ధర్మాలకు అనుగుణంగా మారుస్తూ ముందుకుసాగే మానవఆచరణే అవసరాన్ని అవకాశంగానూ వాస్తవంగానూ మారుస్తుంది. ఆశలకూ ఆదర్శాలకూ నిలయమయిన చైతన్యానికీ, నిర్జీవమయిన భౌతికప్రపంచానికీ, సంధానంసాధించేది ఆచరణ. అది సజీవ భౌతికప్రక్రియ.

బోల్షివిక్ విప్లవం ఈ విషయాన్ని చక్కగా నిరూపించింది. ఇరవయ్యవ శతాబ్దంలో బూర్జువా విప్లవాలు విజయవంతంకాలేవు. కాబట్టి జారిజాన్ని అసంపూర్ణంగా మట్టుబెట్టిన 1917 ఫిబ్రవరి విప్లవం తన కర్తవ్యాన్ని పూరించాలంటే అక్టోబర్ విప్లవం అవసరం అయింది. అయితే మెన్షివిక్కులు బోధించినట్టు ఆ బూర్జువా విప్లవం ంతటతాను పతనమయ్యేతరుణం పరిపక్వమయ్యేదాకా చేతులుముడుచుకొని కూర్చుని టే రెండవ విప్లవం అక్టోబర్‌లో జరిగివుండేదికాదు, ఆ అవసరాన్ని వాస్తవీక ంది, ఫిబ్రవరి నుండి అక్టోబర్ వరకు నడిచిన బోల్షివిక్ ఆచరణ. ఆ ఆచరణ తులను పరిపక్వంచేసే క్రమంలో తన కర్తవ్యాన్ని నిర్వహించకుంటే ఆ క్రమం ర్తిం అయ్యేదికాదు.

పరిస్థితులను మన ఇష్టంవచ్చినట్టు మనం మార్చుకోగలమనీ, మనకు అను ంగా మలచుకోగలమనీ, నా ఉద్దేశ్యం కాదు. పరిస్థితులు భౌతిక పరిస్థితులను నుసరించి మారుతాయి. కాని వర్గపోరాటం ఆ భౌతిక సూత్రాలలో ఒకటి. దాన్ని ది ఆచరణ. క్రియాశీలకమయిన ఆచరణ, భౌతిక పరిస్థితుల స్థాయిని దృష్టిలో కొని వర్గపోరాటం నడపడం ద్వారా ఆ స్థాయిని ముందుకు తీసుకుపోగలుగు . కరీంనగర్‌లో భూస్వాములకూ రైతులకూ మధ్యఉన్న వైరుధ్యం 'తనంతట నపరిపక్వమయి పోరాటరూపంతీసుకోలేదు. రైతాంగాన్ని సంఘటితపరిచిన ఆచరణ ఆ వైరుధ్యాన్ని బద్దలయ్యే స్థాయికి తెచ్చింది. చైతన్యం భౌతికం కాని ఆ చైతన్యంచేపట్టే ఆచరణ భౌతికం. మార్పును సాధించే బాధ్యతను నిర్జీవమయిన ఇతర భౌతిక పరిస్థితులకు వదిలేయము. అట్లాగని వాటిస్వరూప లను విస్మరించి దుందుడుకుగా ముందుకుసాగము. శాస్త్రీయంగా వర్తించి ను సాధించాలి. ఇతర అంశాలను సమన్వయపరచి, భౌతిక ప్రపంచంలో గర్భితమయిన మార్పును సాధించే కీలకమయిన అంశం ఆచరణ. ఈ విషయాన్ని స్పష్టంగా గుర్తించకపోతే రివిజనిజం నుండి మార్క్సిజాన్ని కాపాడుకోలేము.

— కె. బాలగోపాల్

సమీక్షావ్యాసం

# విప్లవ కవితా చరణాల ఎత్తుగడలు:
# ‘‘1971-’80: ఈతరం యుద్ధ కవిత’’

జె సి.

శ్రమశక్తితో పుట్టి దాని పరాయీకరణక్రమంలో వృద్ధిచెందిన సామాజిక చైతన్యరూపాలే నేటి విజ్ఞానం, సంస్కృతి, సాహిత్యాలు. సాహిత్యమనే సామాజిక చైతన్యరూపంలో భాగమే కవిత్వం. కవిత్వం తన మౌలికరూపమయిన పాట నుండి పరాయీకరణచెంది భూస్వామ్య సమాజంలో ఛందోరూపాల్ని, పెట్టుబడిదారీ సమాజంలో వచన కవితా రూపాన్ని పొందింది.

శ్రమశక్తివలనే దాని చైతన్యరూపాలన్నీ సామాజికమైనవి. ఇంకో విధంగా చెప్పాలంటే అవి ఉత్పత్తి సంబంధాల నుండి రూపొందిన సామాజిక అనుభవం యొక్క వివిధరూపాలు. వాటి నాణ్యత సామాజిక అనుభవం యొక్క నాణ్యతపై ఆధారపడి ఉంటుంది. అది సామూహికసంపద పెట్టుబడిగా మారిన పరాయీకరణ క్రమంలోని వివిధ దశలలో వివిధ రకాలుగా ఉంటుంది.

శ్రమశక్తిలో ఇమిడిఉన్న పరాయీకరణ స్వభావంవల్లనే శ్రమ ఉత్పత్తి చేసిన వస్తువును “వాడుక విలువ” (Use-Value), “మారకపు విలువ” (Exchange Value) లు చేకూరుతాయి. ఈ విలువల్ని ఆయా వ్యవస్థలోని సామాజిక సంబంధాలకు, వైరుధ్యాలకు, నాగరిక విలువలకు ప్రాతిపదికగా వర్ణించవొచ్చు.

శ్రమశక్తి సృష్టించిన ప్రతివస్తువు వాడుకవిలువే. ఫ్యూడల్ సమాజంలో ఈ విలువ భూమినాశ్రయించుకుని ఉండి భూస్వామికీ, దాసుడికీ మధ్య సంబంధాన్ని ఏర్పరుస్తుంది. వాడుకవిలువ, దానితో సమానంగా దాసుడూ దోపిడీగామారిన పరాయీకరణ క్రమంలో యజమాని సంపదగా మారిపోతారు. భూస్వామికీ, దాసుడికీ మధ్య పరమైక (absolute) సామాజిక సంబంధంగా మారిన వాడుకవిలువ ఆ క్రమంలోనే భూస్వామికి నిరంకుశాధికారాన్ని కుదిర్చి పెడుతుంది. పరాయీకరణ చెందిన ఈ వాడుకవిలువే సమాజంలోని అన్ని చైతన్యరూపాలను, వాటి స్వరూప స్వభావాల్ని ప్రభావితం చేస్తుంది. అంటే భూస్వామ్య పద్ధతుల్ని, భావజాలాన్నిసృష్టిస్తుంది.

అలాగే శ్రమశక్తి సృష్టించిన ప్రతివస్తువుకూ భూస్వామ్య వ్యవస్థపై అభివృద్ధి సాధించిన పెట్టుబడిదారీ వ్యవస్థలో వాడుకవిలువతోపాటు మారకపు విలువకూడ

కల్గుతుంది. భూస్వామ్యవ్యవస్థలో శ్రమజీవియొక్క ప్రాధాన్యత అతడు సృష్టించిన వాడుకవిలువ తన యజమానిని సుఖపెట్టగల్గినంతవరకే. అంటే భూస్వామికిష్టమైన దాసుడిగాపనిచేసినంతవరకే. అతనికి స్వతంత్రమైనవ్యక్తిగా గుర్తింపు అసలులేదు. కాని పారిశ్రామికంగా వృద్ధిజెందిన పెట్టుబడిదారీ వ్యవస్థలో తాను ఉత్పత్తిజేసిన వస్తువుల్తోబాటు శ్రమజీవికూడ మారకపువిలువని సంపాదించుకొంటాడు. అంటే అతడు ఏకకాలంలో తాను ఉత్పత్తిచేసిన సరకులస్థాయికి దిగజారడమేగాక, తనను ఒకసరకుగా అమ్ముకొనే "స్వతంత్ర ప్రతిపత్తి" ని సంపాదించు కుంటాడన్నమాట. కాని ఈ "స్వతంత్ర ప్రతిపత్తి" దోపిడిగా అవతారమెత్తిన పరాయీకరణ మూలంగా శ్రామికుడికి ఒకశాపంగా పరిణమిస్తుంది. భూస్వామ్యవ్యవస్థలో లేని స్వాతంత్ర్యం, సమానత్వం, భ్రాతృత్వంఅన్న భావాలకు ఈవ్యవస్థలోగుర్తింపు లభిస్తుంది. కాని మారకపువిలువచే ప్రభావితమైన బూర్జువా సామాజిక సంబంధాల సారాంశమైన చైతన్యంలో భాగంగా అవి పరాయీకరణచెంది నిరాకారం, నిరామయ మైన చైతన్యాభాసలుగా మిగిలిపోతాయి. కనీసం భూస్వామ్య సమాజంలోఉండే భ్రమలుకూడా లేకుండా శ్రామికులజీవితం సారవిహీనం అవుతుంది. కాని ఈ సామాజికవ్యవస్థలోనే శ్రమజీవుల్లో వర్గస్పృహ, చైతన్యంకల్గి దోపిడికి వ్యతిరేకంగా పోరాడటానికి కావలసిన భౌతికపరిస్థితులేర్పడుతాయి.

ఉత్పత్తి మారకపువిలువఅయితే అది మారకం అయ్యేమేరకు సామాజిక సం బంధాలను సృష్టిస్తుంది. కాని భూస్వామ్య సమాజంలో ఉత్పత్తి వాడుకవిలువకావడం వల్ల అది భూస్వామికీ దాసుడికీమధ్య మాత్రమే సంబంధాన్ని ఏర్పరుస్తుంది. ఒకడు ఉత్పత్తిచేసేవాడు, వేరొకడు ఉత్పత్తిని దోచుకునేవాడు. ఈమేరకే అదిసృష్టించే సంబంధం. దీనినుండే పుడుతుంది భూస్వామి నిరంకుశాధికారం. భూస్వామి శాసి స్తాడు, దాసుడు శిరసావహిస్తాడు. దీనినుండే అభిజాత్యం, విశ్వాసం, ప్రభుభక్తి వగైరా ఫ్యూడల్ భావాలు పుడతాయి. అంతేకాదు, ఉత్పత్తిఅయేది వాడుకవిలువేగాని మారకపువిలువ కాకపోవడం భూస్వామ్యసమాజపు ఉపరితల అంశాలన్నిటిమీదా తనముద్రవేస్తుంది. వాడుకవిలువల ఉత్పత్తిలో సామాజికసంబంధాలు గ్రామానికి పరిమితమయిఉంటాయి, అంటే సామాజిక అనుభవం సంకుచితంగా ఉంటుంది. సంకుచితం, పరిమితం, అయిన ఈ సామాజికఅనుభవంయొక్క అభావంగా పర మాత్మ, పరమసత్యం, సార్వత్రికమయినధర్మం వగైరా పరమైక (absolute) భావాలుపుడతాయి. మార్క్స్ అన్నట్టు ఈ 'పరమైక' భావాలు స్వయంపోషక

గ్రాముల సంకుచితజీవితపు చిత్రవిచిత్రమైన ప్రతిరూపాలు(fantastic reflections) భూస్వామ్య తత్వశాస్త్రంమీదేకాదు, కళాసాహిత్య దృక్పథాలమీదగూడ ఈ వాడుక విలువలను ఉత్పత్తిచేసే వ్యవస్థ ప్రభావంఉంటుంది. ఉత్పత్తి అయేది మారకపువిలువ అయితే దోచుకునేవాడికి చేతినిండాపని. అమ్ముకోవాలి, అత్యధికలాభం సంపాదించుకోవాలి, మళ్ళీ మదుపుపెట్టాలి, నిరంతరం వ్యాపారాన్నిగురించి ఆలోచించాలి. వాడుకవిలువలను ఉత్పత్తిచేసే భూస్వామ్యసమాజంలో పాలకవర్గాలకు ఈ బాధలు లేవు. అనుభవించడం, ఆనందించడం తప్ప వాళ్ళకు వేరేవ్యాపకంలేదు. ఈ పునాదినుండి పుట్టినవే రసవాదం, సౌందర్యదృష్టి, దాతృత్వం, శూరత్వం మొదలయిన భావాలు.

స్థూలంగా చెప్పాలంటే వాడుకవిలువ, మారకపు విలువ అనబడే ఆర్థికవిలువలు భూస్వామ్య, బూర్జువా వ్యవస్థలలోని సామాజిక సంబంధాలను, అనుభవాలను, చైతన్యాన్ని, అనగా ఆయాసమాజాలలోని కళలను, సాహిత్యాన్ని, కవిత్వాన్ని ప్రభావితం చేస్తాయి.

ఒక కవి కవిత్వాన్ని అతని చైతన్యం యొక్క రూపంగా వర్ణించొచ్చు. అయితే ఆతని చైతన్యం సామాజికానుభవం నుంచి ఉదయిస్తుంది. సామాజికానుభవాన్ని ఒక చెట్టుగా ఊహిస్తే దానిపూలను కవిత్వంగా వర్ణించవచ్చు. కవి యొక్క చైతన్యాన్ని చెట్టుగా ఊహిస్తే దాని పుష్పాల్ని కవితలుగా వర్ణించొచ్చు. లేక ఒక కవితను ఒక చెట్టుగా ఊహించినట్లయితే దాని మొగ్గల్ని కవితా ప్రతీకలుగా చెప్పుకోవచ్చు. ఒక్కొక్క కవితా ప్రతీక సూక్ష్మంగా ఒక్కొక్క సామాజిక అనుభవానికి మొగ్గవంటిది. ఒక్కొక్క కవితాప్రతీక ఒక్కొక్క సామాజిక సంబంధాల సంచయం. భూస్వామ్య కవిత్వంలో అలంకారాలుగా, బూర్జువా కవిత్వంలో శబ్దచిత్రాలుగా మనకు కన్పించేవి ఈ ప్రతీకలే.

వాడుకవిలువ, మారకపు విలువలు వర్గసమాజాల్లోని మనుషుల మధ్య సంబంధాల్నే కాదు మనుషులకూ, ప్రకృతికీ మధ్యగల సంబంధాన్ని కూడా ప్రభావితం జేస్తాయి. కాబట్టే వర్గసమాజంలోని కవిత్వంలో ప్రతీకలు సమాజం నుండి గ్రహించినా, ప్రకృతి నుండి గ్రహించినా వర్గచైతన్యంలో భాగాలే.

శ్రమజీవి, కవి ఇద్దరూ సృష్టికర్తలు. వాళ్ళు చేసేది సామాజికమైన సృజనాత్మకోత్పత్తి. వాళ్ళిద్దరూ పదార్థం, శ్రమల మేళవంజేసి ప్రధానంగా వాడుకవిలువ

లను సృష్టిస్తారు. శ్రమజీవికి పదార్థాన్ని ప్రకృతి యిస్తుంది. కవికి పదార్థాన్ని భాష రూపంలో, ప్రతీకల రూపంలో సమాజమిస్తుంది. అయితే భాష, ప్రతీకలు రెండు కూడా ప్రారంభంలో శ్రమశక్తి ఉత్పత్తులే. శ్రమశక్తి తనకు లభింపజేసిన భౌతికోత్పత్తులకు, సమాజమే తన కందించిన చైతన్య రూపమయిన ఊహను మేళవించి కవి కవిత్వాన్ని సృష్టిస్తాడు. అందువల్లనే కవికి, శ్రమజీవి సృష్టించిన ప్రపంచానికి అవినాభావసంబంధం.

వర్గవ్యవస్థ శ్రమజీవికీ కవికీమధ్యగల రక్తసంబంధాన్ని విడగొట్టడానికి కుట్ర చేస్తుంది. అందువల్లనే పెట్టుబడిదారీవ్యవస్థ కుట్రలో కూరుకుపోయిన కవికి మిగిలేది దుఃఖం, నిరాశ. ఆ కుట్రకు వ్యతిరేకంగా పోరాడదల్చుకున్న కవి శ్రామికవర్గ పక్షపాతి, విప్లవకవి అవుతాడు. త్రిపురనేని మధుసూదనరావుగారి మాటల్లో చెప్పాలంటే, "పెట్టుబడిదారీవ్యవస్థ కవిత్వానికి శత్రువని గ్రహించిన బూర్జువా మధ్యతరగతికవులు శ్రామికచైతన్యాన్ని సంస్కారాన్నిపొంది శ్రామికకవులుగా మారిపోతారు. శ్రామికచైతన్యం ఏరూపంలోఉంటే శ్రామిక కవుల చైతన్యంకూడా ఆ రూపంలో కవితారూపం ధరిస్తుంది." (కవిత్వం - చైతన్యం, విరసం, తిరుపతి)

చారిత్రకంగా అన్నికళల్లాగే కవిత్వం శ్రమ పరాయీకరణక్రమంలో పాలకవర్గాల చైతన్యరూపంగా మారుతుంది. ఈ క్రమం నిరంతరంగా సాగిపోతూ వస్తున్నది. శ్రామికవర్గ పక్షపాతి అయిన కవి ఉన్నతవర్గాలనుండి వచ్చినవాడైతే పాలకవర్గ చైతన్యాన్ని ధిక్కరించి శ్రామికచైతన్యంవైపు ప్రయాణంచేయాల్సి ఉంటుంది. శ్రామికవర్గాలనుండీ వచ్చిన కవులు పరాయీకరణ ప్రమాదాన్ని అనుక్షణం శ్రామికవర్గచైతన్యంతో ఎదుర్కోవాల్సి ఉంటుంది. అందుకోసం విప్లవకవికి నిశితమైన సామాజికస్పృహ, అవగాహన, విప్లవోద్యమాలతో ఏకీభావం అవసరం. కవిగా అతడు, అతనికవిత్వం పోరాటంలో భాగంకావాలి, విప్లవాచరణకావాలి.

ఒక్కొక్క కవితాప్రతీకను ఒక్కొక్క సామాజిక సంబంధాల సంచయంగా చెప్పుకొన్నాం. దాన్ని మొగ్గతోపోల్చుకున్నాం. కవితను పుష్పంగా ప్రతీకరించాం. కవితా ప్రతీకఅన్నా, కవితఅన్నా దానిలోనివస్తువు సామాజిక సంబంధాల సారాంశాన్ని, దానిరూపం సామాజికసంబంధాల ప్రభావాన్ని ప్రతిఫలిస్తాయి. భూస్వామ్య లేక పెట్టుబడిదారీ సమాజాల్లో రాయబడ్డకవితల్లో ఆ వ్యవస్థలకు మౌలికమైన వాడుక విలువ, మారకపువిలువలచే ప్రభావితంగాబడ్డ సామాజికానుభవం ప్రతిఫలిస్తుంది అని చెప్పుకున్నాం. అయితే, కవి శ్రమజీవివలె "వాడుకవిలువ" సృష్టించేవాడుగదా,

కవిత్వమంటే వాడుకవిలువతో సమానమైందిగదా. అయినప్పుడు భూస్వామ్యకవిత్వం, బూర్జువాకవిత్వమని ఎలానిర్ధారించగలం అన్న ప్రశ్నరావచ్చు. శ్రమ ఉత్పత్తిచేసిన వస్తువుకు వాడుకవిలువ ఎలాప్రాథమికమైందో అలాగే కవి ఉత్పత్తిచేసిన కవితకు లేక ప్రతీకకు వాడుకవిలువ ప్రాథమికమైంది. కాని ఈ ప్రాథమికవిలువ వర్గ సమాజంలో ఉత్పత్తిఅవుతూనే పరాయీకరణచెందిన సామాజిక సంబంధంగా మారుతుంది. అంటే పాలకవర్గాల ఆస్తిగామారుతుంది. అయితే, అది భూస్వామ్య కవిత్వమయినా, బూర్జువా కవిత్వమైనా కొంతవరకు శ్రమజీవుల్నుంచి మొదలుకొని బుద్ధిజీవులవరకు అందరికీ అది అప్పీలుచేస్తుంది. దానికి కారణం ప్రాథమికంగా సామాజికమైన సృజనాత్మకోత్పత్తిగా కవిత్వంలో వాడుక విలువ అంతర్లీనమై ఉంటుంది.

అయితే ఈనాటి విప్లవకవి తిరిగి కవిత్వాన్ని వాడుకవిలువగా సృష్టించాలన్న దృష్టి యాంత్రికమైంది. అసాధ్యంకూడా. ఎందుకంటే సామాజిక భౌతికరూపాలయిన భాష, ప్రతీకలు ఈనాటికవికి పరాయీకరణచెందిన రూపంలోనే లభిస్తాయి. అతనికి లభించే సామాజికచైతన్యంకూడ పరాయీకరణచెందిన చైతన్యమే. అయినప్పటికీ శ్రామికవర్గ చైతన్యాన్ని పెంపొందించుకొనడంద్వారా, విప్లవాచరణద్వారా పాలకవర్గచైతన్యానికి వ్యతిరేకంగాపోరాడి, వాడుక విలువని పరాయీకరణనుండి రక్షించి తద్వారా నిజమైన మానవసంబంధాల్ని సమాజంలో తిరిగిస్థాపించవచ్చు. ఈ ప్రయత్నాన్నే రాజకీయపరిభాషలో కమ్యూనిజం అంటారు. కాని ఈ రకంగా రక్షించబడ్డ వాడుకవిలువ వర్గసమాజం ఏర్పడకముందున్నటువంటి వెనుకటివిలువ కాదు. విప్లవ చైతన్యంతో నిగ్గుదేలి అత్యుత్తమ మానవ సంబంధానికి ప్రాతిపదిక ఔతుంది. అటువంటి విప్లవచైతన్యాన్ని పెంపొందించుకొనే క్రమంలోనే కవిత్వం గూడ వర్గసమాజపుకుట్ర నుండి సంరక్షించబడుతుంది. దాన్లో భాగంగానే విప్లవకవి శ్రమజీవుల బతుకువైపు, భాషవైపు, పరాయీకరణ ఉక్కు కౌగిలిలో చితికి నిర్జీవం గాకుండా మౌఖిక సంప్రదాయంలో జీవిస్తున్న పాటవైపు మొగ్గుతాడు.

ఇప్పటి చారిత్రిక పరిస్థితుల్లో శ్రామికవర్గ చైతన్యానికి వచనకవితతో చేయూత నివ్వాలన్న విద్యాధికుల ప్రయత్నం అభిశంసనీయం కాదు. వచన కవితను "బూర్జువా కవితారూపంగా" నిందించడం "సాహిత్యపరంగా సంకుచితం. రాజకీయపరంగా అవివేకం." అవును. కాని అది పెట్టుబడిదారీ వ్యవస్థలోని యాంత్రిక

మైన, నిర్జీవమైన వ్యాపారసంబంధాలను ప్రతిఫలించే కవితారూపం అన్న శాస్త్రీయావగాహన తప్పుగాదు.

ఏ కవిత్వాన్నైనా నిర్దేశించేది కవియొక్క సామాజిక చైతన్యం. వ్యక్తిగా అతని చైతన్యం సామాజిక చైతన్యంలో భాగమే అని మనకు తెలుసు. ఈదేశంలో విద్యాధికులైన మధ్యతరగతి ప్రజల, కవుల చైతన్యంలో వలస, భూస్వామ్య వారసత్వం ముద్ర కన్పిస్తుంది. ఈ వారసత్వం మనల్ని శ్రామికవర్గ చైతన్యం నుంచి ఇంకాదూరం చేసింది. ఈ పరాయీకరణ నధిగమించి శ్రామికవర్గ పక్షపాతాన్ని అలవర్చుకోవాలంటే విప్లవ చైతన్యం, పోరాటపటిమ అవసరం. అవి "ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్, హైదరాబాదు" వారు ప్రకటించిన "71-80 (ఈతరం యుద్ధ కవిత)" అన్న సంకలనంలోని కవితల్లో ఎంతవరకున్నాయో యిక పరిశీలిద్దాం.

కసితో స్వార్థం శిరస్సు గండ్రగొడ్డలితో
నరకగల్గిన వాడే నేటి హీరో
ప్రజల గుండెల కొండల్లో మాటుకాసి
ట్రిగ్గర్ నొక్కగలిగిన వాడే ద్రష్ట
ప్రజను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేడు కవి.

("మైక్రోస్కోపిక్" మార్చి, 1970)

1970 లో ఒక విప్లవకవి రాసిన ఈ పంక్తుల్లో కవిత్వమెక్కడ అంతమై ఎక్కడ నినాదం మొదలవుతుందో చెప్పటం కష్టం. ఈ నాల్గులైన్లలో స్పష్టమైన మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతావగాహన ఏ విధంగా కవితాపరమైన విప్లవాచరణగా, అంటే మంచి విప్లవ కవిత్వంగా మారుతుందో గమనించవచ్చు. ఈ పంక్తులను పరిశీలిస్తే విప్లవకవి అంటే ఎవరు అన్నవిషయం కూడ స్పష్టమవుతుంది.

స్వార్థమనే భౌతికలాభాపేక్ష (material interest) యొక్క శిరస్సును గండ్రగొడ్డలితో నరకగలిగిన వాడే నేటిహీరో. అనగా శ్రమశక్తి యొక్క పరాయీకరణ వల్ల లాభం పొందజూసే గుణాన్ని అంటే స్వార్థంఅనే వర్గలక్షణాన్ని గండ్రగొడ్డలితో నరకగలిగిన వాడే నేటిహీరో. అలాగే, ప్రజల అంటె శ్రమజీవుల హృదయాలనబడే కొండల్లో కాపుగాసి అధికారంపై, దోపిడీపై అంటే వర్గలక్షణంపై ట్రిగ్గర్ నొక్కగల్గినవాడే ద్రష్ట. వర్గసమాజాన్నిపట్టి పీడించే స్వార్థం, దోపిడి,

అధికారం అనబడే పరాయీకరణ రూపాలను అంతమొందించడానికి శ్రమజీవులకు పోరాట చైతన్యం కలిగిస్తున్నవాడే నేటి రివల్యూషనరీ. విప్లవకారుడు. ఆ హీరో, ద్రష్ట, విప్లవకారుడూ అన్నీ ఒక్కడే. ఆ పదాలన్నీ విప్లవకవికి ప్రతీకలే.

పెట్టుబడిదారీ వ్యవస్థలో కవి ఒక "హీరో" వంటివాడు. భూస్వామ్యవ్యవస్థలో అతడు "ద్రష్ట." ఈ రెండురకాల సామాజిక సంబంధాల నధిగమించి అతడు ఈనాడు "రివల్యూషనరీ" కూడా కావాలి. అతని రివల్యూషనరీ చైతన్యంలో ద్రష్ట, హీరోల లక్షణాలు కూడా భాగమే. అలాగే భూస్వామ్యవ్యవస్థపై వర్గకసి విసరగల ఆయుధం "గండ్రగొడ్డలి" అయితే, పెట్టుబడిదారీ వ్యవస్థపై ఆకసి ఉపయోగించాల్సిన ఆయుధం తుపాకీ ("ట్రిగర్"). వాటికి విప్లవ పోరాటాన్ని, చైతన్యాన్ని జోడిస్తాడు ఇప్పటి రివల్యూషనరీ - కవి. ఈ ప్రతీకలు మూడూ ఆయా వ్యవస్థలకు ప్రత్యేకమయిన వర్గసంఘర్షణను రాశి, గుణ, పరిణామాత్మకంగా చూపించేవే.

ఈ లైన్లలో హీరో, ద్రష్ట, గండ్రగొడ్డలితో స్వార్థం శిరస్సు నరకడం, ప్రజలగుండెల్లో మాటుగాసి ట్రిగ్గర్ నొక్కడం- అన్ని ప్రతీకలు ఏవిధంగా సామాజిక సంబంధాల సంచయాలో అలాగే నేడు క్లా అంటే దోపిడిపై విప్లవ పోరాటం సాగించేవాడు అన్న అర్థం స్ఫురించే ఈలైన్లుగూడ ఒక కవితాప్రతీకే. విప్లవ చైతన్యాన్ని, పోరాటాన్ని సూచించే ఈ కవితగూడ జడత్వానికీ, చైతన్యానికి, బూర్జువా కవికీ విప్లవకవికి మధ్యగల వైరుధ్యాన్ని స్పష్టంచేస్తుంది. ఈ కవితలో గమనించాల్సిన ఇంకో ముఖ్యవిషయమేమిటంటే విప్లవకవి తన కవితలో భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థల్లోని సామాజిక సంబంధాల్ని, విలువల్ని సూచించే ప్రతీక లెన్నుకున్నాడు. కాని వాటిని అధిగమించి పూర్వపక్షం చేసే విప్లవ చైతన్యాన్ని జోడించి ఈ కవితను కవితాపరమైన విప్లవాచరణకు ఋనికగా చేశాడు.

ఈ కవితలో "సాయుధం" అన్నమాట యుద్ధంఅన్న అర్థాన్నికూడ స్ఫురింపచేస్తుంది. భూస్వామి, దాసుడు ఈఇద్దరిమధ్యగల వర్గపరమైన సామాజిక సంబంధం వర్గకసిగా మారినపుడు దాన్ని గండ్రగొడ్డలిఅన్న ప్రతీక స్పష్టంగాసూచిస్తుంది. కాని పరోక్షమూ, యాంత్రికమూ అయిన బూర్జువా సామాజికసంబంధం వర్గకసిగా మారినపుడు దాడిచేయడానికి శత్రువు ఒకానొక పెట్టుబడిదారుడి రూపంలోగాకుండా వ్యవస్థరూపంలో లేక ఆవ్యవస్థకు ప్రాతినిథ్యంవహించేవారి రూపంలో, పరాయీ

కరణ చెందిన చైతన్యరూపంలో ఉంటాడు.కాబట్టి పోరాటంకూడా వర్గాలమధ్య పోరాటంగా ఉంటుంది. కాబట్టి శరీరకమైన వర్గపోరాటం "ప్రజల గుండెలకొండల్లో", "కొండల్లో" ఒదిగి ప్రజల్లో విప్లవచైతన్యం ట్రిగ్గర్, దోపిడిపై మరతుపాకీ ట్రిగ్గర్ నొక్కడం అన్న ప్రతీకద్వారా సూచింపబడింది.

ఈ సంకలనంలో మొత్తం 31 కవితలున్నాయి. మొత్తంకవులు 30 మంది. "ఈ పుస్తకంపేరే సూచిస్తున్నట్లుగా ఒకపదేళ్ళకాలం దీనిపరిమితి. సమరశీల సందేశం దీనికవితావస్తువు". ఈ కాలవిభజన ఏదోరకపు కాలవిభజనకోసం చేసుకున్నదికాదు. "కల్లోలదశాబ్దమని, విరసందశాబ్దమని" ఎన్నోపేర్లతో పిలవబడుతున్న ఈ దశాబ్దిసాహిత్యాన్ని అర్థంచేసుకోవాలంటె ఆధునిక కవితాపరిణామచరిత్రను సాహిత్యానికిప్రేరకమైన సామాజిక పరిణామాల్ని చూడాలని చేరాగారు చెప్పారు. కరెక్టే. ఈదశాబ్దంలో విప్లవసాహిత్యానికి ప్రేరణ తెలంగాణా రైతాంగపోరాటం, నక్సల్‌బరీ, శ్రీకాకుళం, సిరిసిల్లా, జగిత్యాల పోరాటాలు. ఆయాపోరాటాల్లో ఉద్భవించిన సాహిత్యపరమైన ఆచరణ. రాజకీయంగా, తత్ఫలితంగా సాహిత్యంలో, ఈ పోరాటక్రమంలో వచ్చిన అత్యంత ముఖ్యమైనమార్పును చెరబండరాజు ఉపయోగించిన కవితాప్రతీక స్పష్టంగా వ్యక్తంచేస్తుంది, అది "విప్లవచరణాల ఎత్తుగడ"ల్లో మార్పు. అంటె వర్గశత్రునిర్మూలననుండి ప్రజల్లో వర్గచైతన్యం రగిలించి విప్లవోన్ముఖుల్నిచేయడం వరకు ఎత్తుగడల్లో వచ్చిన మార్పుమాత్రమే. అయితే ఈ ఎత్తుగడలన్నీ ఒకే విప్లవాచరణలో భాగాలే అన్నవిషయం ముందువివరించిన "మైక్రోస్కోపిక్" కవితలోని విప్లవచైతన్యాన్ని గమనిస్తే తెలుస్తుంది. కాని "భూస్వాముల తలలునరకటం ఆనాటి రాజకీయునినాదం. తుపాకి గొట్టంద్వారానే రాజ్యాధికారం వస్తుందనేది నాటివిప్లవోద్యమాలు ఆదర్శంగా పెట్టుకున్న సూత్రం." అనీ, ఈ సంపుటిలోని "కొన్ని కవితల్లో కనిపించే రాజకీయ ధోరణికి [బహుశ "వివాలా! శాంటియాగో!" లాంటి కవితలు కావచ్చు వారి ఉద్దేశంలో] ఇప్పటి దృష్టితో చూస్తే చారిత్రాత్మకమైన ప్రాముఖ్యం మాత్రమే ఉంది" అని వ్యాఖ్యానించడం యాంత్రికధోరణితో కూడిన అవగాహనలోపం అనిపిస్తుంది. ఈ ధోరణి ప్రభావంవల్లనేనేమో విరసం పుట్టిన సంవత్సరంలో వచ్చిన మంచి కవితా సంకలనాలైన "మార్చ్" "ఝంఝ"ల నుండి, అసలు ఆ సంవత్సరం నుండే, ఒక్కకవితను గూడా సంకలనంలో చేర్చలేదు. అదేవిధంగా మూడు కంటె ఎక్కువ కవితల్ని ఈ దశాబ్దపు చివరి రెండు సంవత్సరాల నుండే ఎన్నుకున్నారు. బహుశ ఈ

దశాబ్దపు చివరికాలంలో వచ్చిన యువకవుల్ని ప్రోత్సహించడానికే ఈ విధంగా చేసి ఉంటారనుకుంటున్నాను.

ఇప్పుడు ఈ సంకలనంలోని "కల్లోల దశాబ్ది"పు కవితా తరంగాలు ఎలా ఉన్నాయో పరిశీలిద్దాం. "విప్లవం పిలుస్తూందిరా" (కిషన్) కవితకు రూపరీత్యా వినాదానికున్నంత బలమున్నది. వస్తువులో పదార్థచైతన్యంచే విప్లవ చైతన్యం ప్రభావితమవుతుంది అన్న అవగాహన కన్పిస్తుంది గాని అటువంటి మార్పులోయిమిడి ఉన్న చారిత్రక గతితర్కం గురించిన జ్ఞానం ఉన్నట్లుతోచదు. ఈ జ్ఞానాన్ని మార్క్సిజం నుంచేగాక సమాజాన్ని అధ్యయనం చేయడం ద్వారా సాధించవచ్చు. దానికి మార్క్సిస్టు అవగాహన. విప్లవచైతన్యం తోడుకాందే ఏకవీ విప్లవ కవిత్వం రాయలేడు. విప్లవదశాబ్ది '71వ సంవత్సరం నుండి ఈ కవితతప్ప ఇంకే యితర కవిత దొరకలేదా సంపాదకులకు ?

రెండో కవిత, "ఇప్పుడు వీస్తున్నగాలి" (అప్పాజీ). 1970 లో అచ్చైన మార్చ్‌లో ఇదే శీర్షికతో ఇంతకంటె మంచి కవిత ఉంది. ఆ కవితలో భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థల్లోని వర్గచైతన్య లక్షణాలు వస్తువులోను, రూపంలోను ప్రతిఫలించే "హీరోయిన్ ప్రీనితంబాలు" వంటి సంకర ప్రతీకలు లేవు. మూడో కవిత, "నగ్జల్బరి మొక్క" (ప్రభంజన్) నిప్పుల పూతేమోగాని సరియైన విప్లవావగాహనను చైతన్యాన్ని పుష్టిగా పులుముకున్న మొగ్గల్ని కూడ వేయలేదు. ఉదాహరణకు :

నా కొమ్మలకు కాయలు మాత్రమే కాదు
భూస్వాముల తలకాయలు కూడ కాస్తాయి
నా కొమ్మలు కొన్ని నరికారేమోకాని
నా వేళ్ళెక్కడున్నాయో వీళ్ళకేం తెలుసు

ఇక "కుట్ర !" (శివసాగర్). ఈకవితలో వస్తువు వర్గకుట్ర. వర్గసమాజపు న్యాయంఅనబడే చైతన్యరూపానికి ప్రతినిధి జడ్జి. భూస్వామ్య భావజాలంలో ఇహంలోగాక, పరంలో జరిగేన్యాయానికి ప్రతీక యమధర్మరాజు. మనదేశంలోని అర్ధవలస, అర్ధభూస్వామ్య సంబంధాలలో న్యాయమూర్తి "అధర్మనిధనంలో యమ ధర్మరాజంతటివాడు." సారాంశంలో భూస్వామ్యవిలువల్ని రూపంలో బూర్జువా భావాల్ని ప్రతిఫలించే మనన్యాయవ్యవస్థ విప్లవకార్యాచరణను కుట్రఅంటుంది. నిజానికి, "భూమినిచాపగాచుట్టి / చంకనబెట్టుకున్న రాక్షసభూస్వామ్యం కుట్ర / నా

దేశాన్ని విదేశాలకు తెగనమ్మే దళారీతనం కుట్ర." ఉత్పత్తిశక్తుల్లో ఒకటైన భూమిని చాపగా చుట్టి చంకనబెట్టుకున్నవాడు భూస్వామి. దేశాన్ని విదేశీ పెట్టుబడికి తాకట్టు పెట్టేవాడు దళారీబూర్జువా. వాళ్ళు చేసేది శ్రామికజీవులకు వ్యతిరేకంగా కుట్ర నిజానికి. ఆ కుట్ర అంతర్జాతీయరంగంలో, "కోసిగిన్ కుష్ఠుపాదాలవద్ద స్నేహఒప్పందం"గా; ఆర్థికరంగంలో, "నిక్సన్ ఓడలుతెచ్చే ఆహారం"గా; రాజకీయరంగంలో, "భారత మహాతంత్రం", "బ్యాలెట్ బాక్స్," "గరీబీహటావో" "ఇందిరమ్మ మందహాసాలు"గా; సాంస్కృతికరంగంలో, "సూర్యుణ్ణి ఉరితీసేందుకు పొంచిఉన్న/ అన్యాయశాస్త్రం అరమోడ్పుకన్నుల్లోని అహంభావం"గా అనేకరూపాల్లో దర్శనమిస్తుంది. ఈ కుట్రను, దోపిడీని, పరాయీకరణను అంతమొందించే విప్లవాచరణలో భాగమే "శ్రీకాకుళ సూర్యోదయం" "గెరిల్లాసూర్యు"ని ఉదయం, శ్రీకాకుళంలో భౌతికవాస్తవికత ననుసరించి సహజంగా విప్లవోదయం జరిగితే దాన్ని కుట్రగా మనన్యాయవ్యవస్థ పరిగణిస్తున్నది. అందువల్లనే విప్లవకవి అతి వ్యంగ్యంగా అడుగుతున్నాడు.

న్యాయమూర్తులంగారూ !
సూర్యోదయం కుట్రకాదు
సూర్యుడు కుట్రదారుడూ కాదు
నిండుచూలాలి ప్రసవవేదన కుట్రనంటారా ?
చరిత్ర రథగమనాన్ని ఏమంటారు !

.... .... ....

.... .... ....

చీకట్లను చీల్చడంకదా సూర్యోదయం
వేడీ వెలుతురూ ప్రజలకి పంచడంకాదా సూర్యోదయం
న్యాయమూర్తులంగారూ !
మీరు....... బహుశా మంచివారే
అధర్మనిదానంలో యమధర్మరాజంతటివారు.

గతితార్కిక చారిత్రిక భౌతికవాదం గురించిన పూర్తిఅవగాహన, సమగ్రమైన విప్లవ రాజకీయచైతన్యం పునాదిగా ప్రతిభావంతుడైన కవిరాసిన ఈ కవిత, వచన కవితా రూపాన్ని వ్యంగ్యాన్ని సందర్భోచితంగా విప్లవకవి ఎంతబాగా వాడుకోవచ్చునో సూచిస్తుంది.

అయితే ఈ కవితలోని కవితాగుణమంతా రూపంనుంచిగాక వస్తువునుంచి, విప్లవచైతన్యాన్నుంచి, ప్రతీకల్నుంచి పుట్టిందేఅని నేననుకుంటున్నాను. దీన్ని ఈ కవే లేక మరేకవైనా పాటలోరాస్తే ఎలాఉంటుంది అన్నప్రశ్న వ్యర్థం. ఈ కవి ఈ కవితలోని వస్తువును పాటరూపంలో పెట్టగలిగేవాడా అంటే ఆవస్తువును శ్రామికజీవుల భాషలో, వారి వర్గచైతన్యస్థాయికి అనుగుణంగా, శ్రామికశక్తికి మౌలికరూపమయిన పాటలో పెట్టగలిగేవాడాఅని అర్థం. ఈప్రశ్నకు సమాధానం కవియొక్క చైతన్యంపై ఆధారపడి ఉంటుంది. మధ్యతరగతి చైతన్యంగలకవి మధ్యతరగతి చైతన్యంగల పాఠకులకోసం రాస్తే చిక్కులేదు. కాని శ్రామికజీవులకోసం, అందునా వచనకవిత్వం రాస్తే కవి, పాఠకులమధ్య అంతరం ఆ కవిత్వానికి విలువలేకుండా చేస్తుంది. విప్లవ చైతన్యంగల మధ్యతరగతికవి విప్లవకవిత్వాన్ని వచనకవితలో రాస్తే దానిప్రభావం పరిమితం. అదిచాలదు. అతడు ప్రధానంగా శ్రామికవర్గ పాఠకుల్ని లేక శ్రోతల్ని ఉద్దేశించి రాయాల్సిన అవసరంఉంది. అలారాస్తే శ్రామికజీవుల భాషలో, అంటే వారిబ్రతుకులోంచి, శ్రమశక్తి సృష్టించిన ఉత్పత్తి సంబంధాలలోంచి పుట్టిన భాషలో, పాటలో, ప్రతీకల్లో- అంటే శ్రామికవర్గ చైతన్యం సృష్టించిన వస్తువు, రూపాలలో కవిత్వాన్ని రాయాల్సి ఉంటుంది. పరాయీకరణ క్రమంలో యింకా చిక్కుకోనటువంటి మౌఖిక సాంప్రదాయంతో అంటే పరాయీకరణ క్రమంలో చిక్కుకుపోని శ్రామిక వర్గచైతన్యంతో ఏకం కావాల్సిఉంటుంది. దానికి మధ్యతరగతి భావాలు, విద్య పెద్దఆటంకాలు. అయితే ఈ ఆటంకాలను కూడా విప్లవాచరణలో చాలావరకు అధిగమించి విరసం పుట్టిన సంవత్సరంలోనే "నరుడో ! భాస్కరుడా !" అన్న పాటను రాయగలిగాడు శివసాగర్, ఈపాట విప్లవాచరణగా విప్లవకవిత్వానికి మంచి ఒరవడి అయ్యింది.

అయితే, "కుట్ర!"లోని విప్లవచైతన్యాన్ని పాటలోచెప్పగలిగితే దాన్ని యింకా ఉన్నతమైన విప్లవ కవిత్వంగా వర్ణించవొచ్చు. కాని శివసాగర్ ఆ కవితను మధ్యతరగతి పాఠకుల కోసమే రాసినట్లు స్పష్టం అవుతున్నది. అతడు ఏమాత్రం విప్లవ రాజకీయ స్పృహ ఉన్నవారికైనా స్పష్టంగా అర్థమయ్యే రీతిలో అత్యంత ప్రతిభావంతంగా వచనకవితా రూపాన్ని వాడుకున్నాడు. బూర్జువా సమాజంలోని సామాజిక సంబంధాల స్వభావాన్ని వ్యక్తీకరించే వచనకవిత ఆ సమాజంలోని వైరుధ్యాల్ని వ్యంగ్యరూపంలో చిత్రించడానికి అనువుగా ఉంటుంది. ఈ లక్షణాన్ని శివసాగర్ వంటి కవి తీక్ష్ణంగా వాడుకోగలడు అని "కుట్ర!" రుజువుచేస్తుంది. ఈ అర్థంలో

వచనకవితను ఏవిప్లవకవైనా ఉపయోగించుకోవచ్చు. అలాగే ఏ విప్లవకవైనా గద్దర్ లాగా పాటలో కవిత్వాన్ని చెప్పలేకపోతే అతడి కవిత్వం సంపూర్ణార్థంలో విప్లవాచరణ కాలేదన్నమాట. అంతేగాని "పాటకున్న ప్రయోజనాల్తోబాటు పాటకుకొన్ని పరిమితులున్నాయి" అంటే సమస్యను ఆలోచించకుండా దాచేయటం అవుతుందని నేననుకుంటాను.

ఇక శివసాగర్ దే ఇంకో కవిత "వివాలా ! శాంటియాగో !" "కవితావ్యాసం లాంటి సిద్ధాంతపరమైన 'శాంటియాగో !'" అన్నారు. ఇంతానయం, వినాద ప్రాయమైన కవిత అనలేదు "కుట్ర ?" లోని గతితర్కాన్ని విప్లవ (కవితా) చరణాల ఎత్తుగడలతో కవితాపరం చేయకపోతే అదికూడా వారికి సిద్ధాంతపరమైన కవితా వ్యాసంగా కన్పించేదే. వచనకవిత్వాన్ని "సూక్ష్మదృష్టి" గల విమర్శకుల బారినుండి తప్పించాలన్న తపనతోనైనా "సిద్ధాంతపరమైన కవితావ్యాసా"న్ని సైతం కవిత్వంగా గుర్తిస్తున్నారు. చాలు. "పాటలన్నీ ఒకేరకం ఎట్లాకావో వచన కవిత్వమంతా ఒకే మూస" కాదు అంటున్నారు. నిజమే. మన తెలుగు కవిత్వంలోని వచనకవిత బూర్జువా వ్యవస్థకు పరాకాష్ఠగా చెప్పుకోగల సామ్రాజ్యవాద వ్యవస్థల్లోని వచనకవిత ఒకేమూస కాదు. ఉదాహరణకు టి. యస్. ఇలియట్ వేస్ట్‌లాండ్ సామ్రాజ్యవాదులైన పశ్చిమదేశాల్లోని ఇంగ్లీషు కవిత్వంలో వచనకవితను కూడా ఖాతరుచేయక, వెనక్కుపోయి భూస్వామ్య వ్యవస్థలో ఉద్భవించిన ఛందోరూపాల్ని కూడా ఇప్పుడు వాడుకుంటున్నారు.

అంతర్జాతీయత, మిలిటెన్సీలు కూడా వర్గచైతన్యంలో భాగాలే. ఈ లక్షణాలే శ్రామిక వర్గ పక్షపాతియైన కవిని చిలీ ప్రజలు చేస్తున్న పోరాటాన్ని సమర్థించేటట్లు చేస్తాయి. "వివాలా! శాంటియాగో!"లో రివిజనిస్టు పంథాను చేపట్టి అలెండీ దేశాన్ని ఇంపీరియలిస్టు దౌర్జన్యానికి అలనాలంగా మార్చాడు. ప్రజాపోరాటాన్ని కాదని దేశాన్ని నిర్వీర్యంచేసి శత్రువుముందు నిరాయుధంగా నిలిపిన అలెండిజం దేశాన్ని

వివస్త్రనుచేసి ముష్కరుల ముందు నిలిపింది.

.... .... ....

శత్రువు ముందు బలిపశువుగా విసిరింది

"....తుపాకీ గొట్టంద్వారానే రాజ్యాధికారం / సిద్ధిస్తుందనే సత్యాన్ని" అనగా నక్సల్‌బరీ మార్గాన్ని ప్రజలనుండి దాచింది అంటాడు కవి. తుపాకీ గొట్టంద్వారానే

రాజ్యాధికారం సిద్ధిస్తుందనే మార్క్సిస్టుసూత్రాన్ని సంకుచితమైన బూర్జువా అర్థంలో కాకుండా పాలకవర్గాలనుండి రాజ్యాధికారాన్ని శ్రామికవర్గం తనవశం చేసుకోవడానికి విప్లవ మార్గంలో ప్రధానభాగంగా సాయుధవిప్లవం అవసరమనే అవగాహనతో అర్థం చేసుకోవాల్సిఉంటుంది.

భౌతికప్రపంచంలోని ఏ వస్తువుతైనా కవితాపరంగా స్పందించాలంటే ఆ వస్తువుతో పాఠకుడికి, కవికున్నట్లే ప్రాథమిక సామాజిక సంబంధం కల్గిఉండి అతనిచైతన్యంలో భాగంకావాలి. మనదేశంలోని పరిస్థితులను కవితాపరంగా వర్ణించేటప్పుడు ఇక్కడి భౌతికపరిస్థితుల గురించిన జ్ఞానం, చైతన్యం మనల్ని వాటిని వర్ణించేటందుకు కవి ఉపయోగించిన ప్రతీకలకు స్పందించేటట్లు చేస్తాయి. అలాగే "శాంటియాగోలోని సామాజికదృష్టి, వైశాల్యం, వర్గసంబంధాల అంతర్జాతీయత, చారిత్రావగాహనలకు స్పందించాలంటే చారిత్రిక భౌతిక గతితర్కంగురించే కాదు, మార్క్సిస్టు-లెనినిస్టు భావాలు, చిలీచరిత్ర, ప్రపంచచరిత్ర గురించినజ్ఞానం అవసరం. అలాగే చిలీదేశంగురించిన భౌగోళికజ్ఞానంకూడా అవశ్యం. లేకపోతే ఈకవితలోని వేగానికి, తీవ్రతకుమాత్రం స్పందించినా సిద్ధాంతాన్ని విడదీసిచూసి దీనికి "కవితావ్యాస" మనిపేరుపెట్టే ప్రమాదంఉంది. "మైక్రోస్కోపిక్"లో చెప్పినట్లు చైతన్యవంతుడైన కవి తనగీతంలో జ్వలిస్తాడు. ఆ జ్వలించే లక్షణమే ఈ గీతానికుంది.

శాంటియాగో! శాంటియాగో!
చూశావా!
నీ చుట్టూమండుతోన్న చీకటిమంటల నాల్కలకొసల
జ్వలిస్తోన్న పారిస్ కమ్యూన్ అనుభవాలు!

చరిత్రను మానవ సమాజాల్లోని వర్గసంబంధాలనుతెలిపే శాస్త్రంగా వర్ణించేటట్లయితే ఈ ప్రతీకను చారిత్రిక కవితాప్రతీక అనిపిలవొచ్చు. ఇలాంటి ప్రతీకలు ఈ కవితకు ప్రాణం.

"ఆహ్వానం" (యాత్రిక్) ఇంకోమంచికవిత. ఈ విప్లవ కవితాదశాబ్దిం మధ్యకాలంలోవచ్చిన విప్లవాచరణలోని ఎత్తుగడలలో మార్పు "విప్లవ (కవితా) చరణాల ఎత్తుగడల" మార్పుల్లో ఎలాప్రతిఫలించిందో సూచిస్తుంది. వర్గవ్యవస్థజేసే కుట్రకువ్యతిరేకంగా పోరాటంసాగించిన కవుల్ని, విప్లవకారుల్ని దోపిడీవర్గాల

కొమ్ముకాచే ప్రభుత్వం కుట్రకేసుల్లో ఇరికించి కటకటాలవెనుక దోసింది. కటకటాలవెనుక చీకటిలో తాత్కాలికంగా పడలిపోయిన ఎర్రపూల స్వప్నాల్ని విప్లవాచరణలో ప్రాణంపోసుకున్న ఒక విప్లవయోధుని కవిత్వం తిరిగివెలిగించింది. "పోరాటం ఊపిరిగా పయనించిన నీ అక్షరాలు /.... మానవతా అశ్రువుల్లో ఆర్ద్రమైన గుండె మీద / పదునుపెట్టిన నీకసి అంచుమీద నెత్తుటిగంటు / అదే అదే అరుణతార." కవిత్వమే కమ్యూనిజంగా విప్లవచైతన్యంలో జైలులోని విప్లవకారులందరికీ మార్గదర్శకంఅయి తమ విప్లవ ఎత్తుగడల్ని సమీక్షించుకోవడానికి దోహదంజేసింది. చివరకు విప్లవకారుడైన కవి ప్రజాపంథాను తన మార్గంగా ఎంచుకుంటాడు.

జనం గుండెలోని ఆయుధాన్ని ఎర్రజెండాగా
రక్తం శ్వాసించిన సమరంగా చరిత్ర మన చేతుల్లో పెట్టింది.

జనం గుండెల్లోని ఆయుధం వర్గకసి, వర్గచైతన్యం. అది చారిత్రిక భౌతికసంబంధం అనగా సామాజిక సంబంధాన్ని వర్గసంఘర్షణగా ప్రభావితం చేస్తుంది. అది వర్గ పోరాట రూపాన్ని, "ప్రజాయుద్ధ" రూపాన్ని తీసుకున్న వర్తమానంలో కవి ప్రజల పక్షం వహించడాన్ని నిర్ణయించుకుంటాడు.

ఏ ఒక్కరి ఆనందం కోసమో వేళ్ళుతెగే వీణానాదంకాదు
మన పేగులమీద ప్రపంచ ప్రజల
విప్లవ ఆకాంక్షలు మీటుదాం

వీణపై ఏ ఒక్కరికోసమో వేళ్ళుతెంచుకునేది భూస్వామ్య సమాజంలో, పెట్టుబడి దారీ సమాజంలో. కాని అందరికోసం తమ బ్రతుకుల్నే సంగీతసాధనంగా చేసి వాటిపై సీమలులేని శ్రామికరాజ్యాన్ని స్థాపించుకుందామన్న ప్రపంచ ప్రజల విప్లవ ఆకాంక్షల్ని మీటేవారు విప్లవకవులు. చివరకు కవి కవిత్వరూపంలోని విప్లవాచరణే తన ఊహాలకు ఇంతగా కాంతినిస్తుంటే, "మనం ప్రజల రాజ్యాధికారం కత్తిని నిర్మించే / కొలిమిలో రవ్వలమైతే ఎంతవెలుగు!" అని ఉత్తేజితుడౌతాడు. శ్రామిక రాజ్యాన్ని గురించి ఈ కవి కనే కలలవెలుగు, దానికై ఎన్నిత్యాగాలకైనా సిద్ధపడే తహతహ ఈ కవితలోని ప్రతి ప్రతీకలో పదకలో స్పందిస్తున్నాయి.

మామూలు సంభాషణను వచనకవితగా మలిచిన "అపస్వరాలు" (నారా) వ్యంగ్య ప్రధానమైంది.

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో రాయబడ్డ ఈ కవితలో ప్రజల్లో దీదరికాన్ని, ఆకలిని మరపింపజేయడానికి మధ్యయుగాల్లో పెంపొందిన భూస్వామ్య భావజాలంలో భాగాలైన ఆంధ్రసంస్కృతిని, తెలుగుభాషా వైభవాన్ని, సన్నయ దొప్పదనాన్ని ఎరగాపెట్టే దళారీ బూర్జువా ప్రయత్నాన్ని కవి అపహాస్యం చేస్తున్నాడు. శ్రమనుండి పరాయీకరణ జెంది పాలకవర్గాలకు ఊడిగంచేసే స్థాయికి దిగజారిన సంస్కృతి, దేశభక్తి, భాషలు నిజానికి పాలకవర్గాల చైతన్యరూపాలు. ఇవి ప్రజల ఆకల్ని మాత్రం తీర్చలేవు. శ్రమజీవుల వర్గచైతన్యాన్ని అదిమి ఉంచడానికి వారిపై పాలకవర్గాల చైతన్యాన్ని పులిమే ప్రయత్నం సమాజంలో అంతర్లీనంగా సాగుతున్న వర్గసంఘర్షణరూపమే. ఈ భావాన్ని ఈ కవిత స్పష్టంగా స్ఫురింపజేస్తున్నది.

ఇక శ్రీశ్రీ "భూమ్యాకాశాలు." భూమి శ్రమశక్తికీ, ఆకాశం స్వేచ్ఛకు ప్రతీకలుగా తీసుకుంటే వారు కిష్టాగౌడ్, భూమయ్య. వారిపై ఉరితీసిన ప్రభుత్వానిది వ్యర్థచర్య. బతుకోసం తమ ప్రాణాలు త్యాగం చేసిన వాళ్ళు ఎల్లప్పుడు బతికే ఉన్నారు. "మరణంలేని మహదాశయమే మనకు వాళ్ళిచ్చిన నిధి."

సమాజానికి కాలం పెట్టిన అప్పును
ప్రాణాలతో వారు తీర్చుకున్నారు.

వర్గసమాజంలో అప్పు అంటే పరాయీకరణ చెందిన శ్రమశక్తి శ్రమజీవుల వద్దకు నైరూప్య దోపిడీ సంబంధం రూపంలో చేరడం. దాన్నే కవి సమాజానికి కాలం పెట్టిన అప్పుగా వర్ణించాడు. ఈ అప్పును శ్రమజీవుల్లో, విప్లవకారుల్లో ఎవరో ఒకరు వర్గపోరాటంలో తమ ప్రాణాలతో తీర్చుకుంటూనే ఉంటారు. అంటే వర్గ పీడనకు బలిఅవుతూనే ఉంటారు. ఇది సామాజిక సత్యం. "ఎల్లప్పుడూ వాళ్ళలో రగిలే పగ / ఎన్నటికీ తీరనే తీరదు," వర్గసమాజమున్నంతకాలం. కిష్టాగౌడ్, భూమయ్యలు

చీకటిని పిడికిళ్ళతో పిండి
వెడుగును చీల్చి చెండాడారు.

ఇటువంటి అధివాస్తవిక ప్రతీకలు పశ్చిమదేశాల్లో పరాయీకరణ చెందిన వర్గచైతన్య రూపమయిన సాహిత్యలక్షణాలు, శ్రీశ్రీ కవిత్వంలో కొల్లలు. "పిడికిలి" శ్రామిక వర్గచైతన్యానికి గుర్తు. శ్రామిక వర్గచైతన్యంతో కిష్టాగౌడ్ - భూమయ్యలు చీకటి అంటే దుర్మార్గాన్ని పిండిపిప్పి చేశారని అర్థం.

శ్రీశ్రీ యొక్క ప్రత్యేకత ఏమిటంటే బూర్జువా నాగరికత క్షీణదశల్లో పశ్చిమ దేశాల్లో వృద్ధిచెందిన అధివాస్తవికత లాంటి ధోరణుల్ని, మన ఫ్యూడల్ వ్యవస్థలో పెంపొందిన భాషాభేషజాల్ని, సోషలిస్టు దేశాల్లో ఉద్భవించిన సామాజిక చైతన్యాన్ని వర్గదృష్టినీ, ప్రపంచ సాహిత్యంలోని గొప్పగొప్ప కవుల ప్రతిభల్నీ, అన్నింటినీ జోడించి, జీర్ణించుకుని ఉత్తేజకరమయిన కవిత్వసృష్టి చేయగల్గడం. తెలుగులో విప్లవ కవితామార్గాన్ని మొట్టమొదట చూపినవాడు ఆయన.

"తిరిగి లక్షలాది మందితో" (నిఖిల్). ఈ కవితలో "మళ్ళీ వస్తాను / ఈసారి లక్షలాదిమందితో తిరిగి వస్తాను" అన్న స్పార్టకస్ మాటల్లోని చారిత్రక సత్యాన్ని కవితాపరంగా చెప్తున్నాడు కవి. మనిషిని మారకపువిలువల మాయలోపడవేసి వంటరిగాణ్ణిచేసే ఈ వర్గవ్యవస్థలో మనమంతా భాగమే. ఈ వర్గవ్యవస్థను రంగస్థల ప్రతీక ద్వారా సూచించదల్చుకున్నాడు కవి. మౌలికంగా నాటకంలో నటులెంత ముఖ్యమో ప్రేక్షకులూ అంతే ముఖ్యం. కాని వర్గవ్యవస్థలో రూపాంతరం జెందిన నాటకకళలో ప్రేక్షకుల పాత్ర చాలా నిస్సహాయంగా (Parsive) ఉంటుంది. అలాగే మన ఈ వ్యవస్థ అనబడే రంగస్థలంపై ప్రేక్షకులుగా చేయబడ్డ శ్రామిక వర్గం, శ్రామికవర్గ పక్షపాతులు నిస్సహాయులు. "సమస్యను పరిష్కరించలేకున్నా / మనమంతా సమస్యలో భాగమే," అన్న సాస్త్రిమాటలు ఈ నిస్సహాయతను సూచిస్తాయి. కాని

ప్రేక్షకులు రేపు రంగస్థలంపై రాకతప్పదు
ఈనాటి నటులు ప్రజల తీర్పును
శిరసావహించక తప్పదు,

అంటాడు కవి. ఈనాటి నిస్సహాయ ప్రేక్షకులైన శ్రామికవర్గమే రేపు వ్యవస్థా రంగస్థలంపైకి పాత్రలుగా, పాలకులుగా రావడం తప్పదు. ఈనాటి పాలకులు ప్రజల తీర్పును అప్పుడైనా శిరసావహించక తప్పదు అంటాడు కవి. చారిత్రక గతిసూత్రాన్ననుసరించి శ్రామికవర్గ నియంతృత్వం తప్పనిసరిగా ఏర్పడుతుందన్న అవగాహన ఈ నాటకప్రతీక ద్వారా కవి సూచించదలిచాడు కాని శ్రామికవర్గ నియంతృత్వ సాధనలో తప్పనిసరైన వర్గపోరాటం, విప్లవాచరణల స్థానాన్ని సూచించడానికి ఆ ప్రతీక సరిపోదు. కాబట్టి ఈ కవితకే ప్రాణంకావాల్సిన ఈ రంగస్థల ప్రతీక యాంత్రికమై, సంకుచితమై కవితనుగూడ పేలవం చేసింది.

దేవిప్రియ "అడవి"

....అడవీ నువ్వంటే నాకిష్టం.
రేపటి దేశానికి ఈనాటి తల్లివి నువ్వు,
రేపటి ఆకాశానికి
ఈనాడే పూసిన సూర్యపుష్పానివి నువ్వు,
అడివీ, నీ పేరు వింటేనే నాకు పూనకం వస్తుంది.

అంటాడు కవి. శ్రీకాకుళ అడవుల్లో గిరిజనులు జరిపిన పోరాటరూప ప్రభావంవల్ల నైతేనేమి, అడివిని అజ్ఞాత స్థావరంగా ఊహించుకోవడం వల్లనైతేనేమి అడవికీ, విప్లవకారులకూ మధ్య అవినాభావసంబంధం విప్లవ పక్షపాతులైన కొంతమంది యువకవుల ఊహల్లో చోటు చేసుకుంది. వారికి అడవి పేరు వింటేనే "పూనకం" వస్తుంది.

భూస్వామ్య వ్యవస్థలో వ్యక్తిగా గుర్తింపు ఉండేది యజమానైన భూస్వామికి లేక దేవుడు: దెయ్యాలకు మాత్రమే. కాబట్టి దాసుడు తనకులేని స్వేచ్ఛను, మనిషికీ స్వభావసిద్ధమైన స్వేచ్ఛాప్రవృత్తివల్ల తనను దేవుడో, దెయ్యమో ఆవహించి నట్లు ఊహించుకుని పొందజూస్తాడు. దీన్నే పూనకం అంటాము. ఈ పూనకం పెద్ద రొమాంటిక్ భావన. అడివి, విప్లవం గురించిన ఇలాంటి రొమాంటిక్ భావనే ఈ "కల్లోలదశా"బ్దపు మొదటి కొద్ది సంవత్సరాలలో సామాజిక భౌతిక పరిస్థితులతో అంతగా పరిచయంలేని కొంతమంది యువవిప్లవ కవులకు ఉండేది. కాని ఈ భావన సామాజికానుభవం విప్లవాచరణగామారే క్రమంలో చెల్లుబడిపోయింది. 1974 నవంబర్‌లో మొదటిసారి ప్రచురించబడిన ఈ సంకలనంలోని యాత్రిక్ కవిత, "ఆహ్వానా"న్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. "ఆహ్వానం"లో విప్లవ కారుడైన కవి ప్రజాపంథాను, ప్రజల గుండెల్లోని వర్గకసిని ఆయుధంగా, తన మార్గంగా ఎంచుకున్నాడని ఇదివరకే చెప్పుకొన్నాం. ఇక దేవిప్రియ "అడివి" 1977 జులైలో ప్రథమంగా అచ్చయింది.

అడివిని తల్లిగా ఊహించుకుని, అడివిలో ఒరిగిపోయిన విప్లవకారులు జార విడచిన "విల్లంబులూ తుపాకులూ" మొదలగు ఆయుధాలను యేరి ఉంచమని అడివి తల్లిని అడిగేవిధంచూస్తే ఈ కవి చైతన్యంలో మహాభారత కథలోని పాండవుల అజ్ఞాతవాసం, జమ్మిచెట్టూ మొదలగు భావాలు ఎంతగా జీర్ణించుకుని ఉన్నాయో తెలుస్తుంది. అలాగే

ఈ దేశాన్ని
ప్లాస్టిక్ తీగల విషపుష్పాల ఉద్యానవనాల నుంచి కాపాడడానికి,
ఏదో ఒకనాడు
నేను నీసాయమే కోరతాను

అంటాడు. అంటే రూసో లాగ మనిషిని "కృత్రిమనాగరికత" నుంచి కాపాడి తిరిగి అడివిలోకి, ప్రకృతిలోకి పంపదల్చుకున్నాడా దేవిప్రియ? ఈ కవి సమాజాన్ని, వర్గపోరాటాన్నీ శాస్త్రీయంగా కాక రొమాంటిక్ ధోరణిలో అర్థంచేసుకున్నట్లు కన్పిస్తున్నది. ఈ కవితకూడ "ఈ తరం యుద్ధ కవిత"లో భాగమే.

సామాజికానుభవం, అవగాహన, విప్లవచైతన్యం, కవితాశక్తి పుష్కలంగాగల కవిత చెరబండరాజు "పునర్జన్మ". జనం గుండెల కొండల్లో వర్గచైతన్యం ట్రిగ్గర్ను అతిరాకచక్యంగా నొక్కడానికి విప్లవ కవితాచరణాల ఎత్తుగడల్ని వచన కవితలోనే గాక పాటలలో కూడ రూపొందించగల ప్రజ్ఞావంతుడు చెరబండరాజు. విప్లవ చైతన్యానికి భౌతికప్రపంచంలో ప్రతీక సూర్యుడైతే, విప్లవ చైతన్యంలో చెరబండరాజన్నంతగా ఎదిగిపోయిన విప్లవకవి. కాబట్టే పోలీసులు అతని

....పాదముద్రల్లో
విప్లవ చరణాల ఎత్తుగడల్ని పట్టుకోడానికి
మట్టిని భద్రపరచి పరిశోధనలకంపుతారు.

"నాది శ్రమైకజీవన సౌందర్యగీతం / మతానికీ దోపిడీ పథానికీ నేను పల్లవినికాను" అంటాడు చెర. మన ఈ అర్థ భూస్వామ్యవ్యవస్థలో మతానికీ, దోపిడిపథానికీ పల్లవయ్యేది మధ్యతరగతి కవుల కవిత్వం, కాని శ్రామిక చైతన్యంలో భాగమయిన విప్లవకవి కవిత్వంగాదు. "వాళ్ళ పల్లకీకి బోయీగ మారకపోవడం" వల్లనే, అంటే అధికార సంస్కృతికి సేవకుడుగానందువల్లే అతని "భావాలవేడి"ని అనుమానించి తుదకంటా నాశనం జేయాలని చూస్తారు. "అనాలోచితంగా అమాయకంగా / ఆకాశం (స్వేచ్ఛ) కేసిచూస్తే / నా (అతని) చూపుల (చైతన్యం) ఎత్తుపల్లాల్ని కొలుస్తారు." అతని కళ్ళు అసహ్యించుకుంటున్న కుళ్ళును తొలగించకుండా అతని కళ్ళనే పెకిలిస్తారు. ....తన స్వేచ్ఛ నుండి, భాషనుండి, భావాలనుండి పరాయివాడై "వాళ్ళ పాటకు" శ్రమజీవిలాగే పల్లవిగాకపోతే దేశద్రోహి, కుట్రదారుడనీ కొరతవేస్తారు. అయినా చెరబండరాజు తన విప్లవదీక్ష చలించని కవి.

విప్లవచైతన్యమైన తనరక్తాన్ని బొట్టుబొట్టుగా ఈ నేలపై విత్తనంగా చల్లడానికి సిద్ధమవుతాడు.

టంకశాల అశోక్ కవిత "అలీనభుజంగాలు" శీర్షిక మాదిరిగానే కవిత కూడా దళారీపెట్టుబడిదారుల వర్గలక్షణాన్ని ప్రతిఫలించే అలీన విధానానికి ప్రతీకే.

నిజంగా అలీన విధానమంతసుఖం మరొకటి లేదు
కుందేళ్ళతో పరుగెత్తవచ్చు
కుక్కలతో కలిసి వేటాడవచ్చు

పెట్టుబడిదారీ వర్గలక్షణంపై ఇంతకంటె మంచి వ్యంగ్యవ్యాఖ్య ఉండబోదు.

"బాధకి హైటెక్ లేదు" అన్న స్మైల్ కవితను బహుశ మినీకవిత అనాలేమో. "శవాల సముద్రపు తాడెత్తుఅలల్ని నా / కన్నీటి కరకట్టతో / అడ్డుకుంటున్నాను." సాధారణంగా సముద్రాన్ని జనానికి, చైతన్యానికి, బ్రతుక్కి ప్రతీకగా తీసుకుంటారు. కాని ఈ కవి సముద్రాన్ని "శవాలసముద్రం" అంటున్నాడు. తుఫాను బీభత్సం దీనివస్తువైతే తీరానికవతల నిజమైనసముద్రం. ఈవల శవాలసముద్రమనా? శవాల సముద్రంలో "రాజకీయుడి" కోసం వెతుకుతున్నాడా? లేక శవసముద్రం లాంటి రాజకీయం, మధ్యతరగతి రాజకీయం, తనను ముంచెత్తబోతుందనా? లేక ముందుమాటలో సూచించినట్లు శవాల్తో రాజకీయంనెరపేవాళ్ళు తనను దోపిడీ చేస్తున్నారనా? వీటన్నిటికీ సమాధానం ఈ కవితలో సులభంగా దొరకదు. ఇది ఆధునిక కవిత్వంగావచ్చు. అస్పష్టత (ambiguity) దీని లక్షణం. సమాజంలోని అన్యాయం, నిరాశ, దుఃఖం అనబడే భౌతికసత్యాల్ని గుర్తించినప్పటికీ వాటికి కారణమైన వర్గసంబంధాలను, చారిత్రిక భౌతికగతితర్కాన్ని అర్థంచేసుకోలేక అయోమయావస్థలో పడిపోయినవారి చైతన్యలక్షణం అస్పష్టత. ఈ కవితకూడా "యుద్ధ కవితే" నంటారా?

తరువాతొచ్చేది "కావ్యగుచ్ఛం". కాని ఈ కావ్యగుచ్ఛాన్ని కొంచెం సేపాపి, కె. శివారెడ్డిగారి కవిత "నాఅక్షరం"లోని స్పందనవిందాం.

ఆ కుర్రాడు
నన్ను గుంటపెట్టి తవ్విపోస్తున్నాడు.
నేను సముద్రమయ్యేంతవరకు

కుర్రాడిదైన్యస్థితి కవి గుండెలోబాధను తవ్వేతీరుకు మంచివర్ణన. కవి ఆ బాధలో ఆ కుర్రాడికి తల్లిదండ్రులుకాగల అంట్లుతోమేవెంకమ్మ, రోడ్లూడ్చే మైసమ్మ, ఎదురు తిరిగి సమ్మెకట్టి మరణించిన కార్మికుడు సుబ్బయ్యవంటి శ్రమజీవుల సముద్రంతో ఏకమౌతాడు. "ఒరే నాయనా! నాకాయితాలమీదుగా నడిచిపోరా / నీ పదముద్రల్ని నా గీతాలుగామార్చుకుంటా / గుండెనిండా శ్రీకాకుళాలు నినదించిన / గీతచరణాలే నీ చరణాలు." చాలా ఆర్ద్రమైనఊహ.

నన్ను సముద్రంచేసి, నన్ను భూమినిచేసి, నన్ను అడివినిచేసి
వెళ్ళిపోయిన కుర్రాడా! నువ్వు నా అక్షరానివి.

విప్లవ వాస్తవికతకు మంచిప్రతీకలు. ఈకవిలో కార్మికవర్గ పక్షపాతం, విప్లవ స్వాయత్తత పుష్కలంగాఉన్నాయి. కాని సామాజికసంబంధాల గురించిన విప్లవ చైతన్యం, సామాజిక భౌతికగతితర్కజ్ఞానంపాలు తక్కువనిపిస్తున్నది.

యాత్రిక్, చెరబండరాజుల కవితల్లాగే చలసానిప్రసాద్ "ఖైదుకవిత"కూడా చెరసాలలో బంధింపనలవిగాని విప్లవచైతన్యంపాడే స్వేచ్ఛాగీతం. "నా గుండె గోదారి / సంతోషసలిలాలు / కలంకాలువలనుంచి / పాటీబోదెలగుండా / ఆకుపడుగు అక్షరాల్లో / ఇంకుతున్నాయి / దిగుడుబావి బందిఖానాలో / ఎడతెగని నీ తలపులే / నాకు / నాకథుసీకరాలు." ఈ కవితలోని ఊగు, తూగులో విప్లవచైతన్యంలో సమానంగా రంగరించుకుని పోయిన పండిత భాషా, శైలి, భావనిర్భరత కన్పిస్తాయి.

హెచ్చార్కె కవిత జీవితమనే గరుకురాయిమీద "పదునుదేరినపాట" వర్గ సంఘర్షణలో, శ్రామికవర్గ పక్షపాతంతో, విప్లవ చైతన్యంతో పదునుదేరిందతని కవిత్వం. ఆర్తులతో, మృతవీరులతో మమేకమయిన అతని కవిత, పోరాటరూప మయిన అతనిగీతం "గుండెమండి రాసినగీతం / మళ్ళీ గుండెనుమండిస్తుంది" కాని హృదయరంజనమెట్లా అవుతుందని అడుగుతాడుకవి. ఈ కవికి ఇదమిద్ధమని చెప్పదగిన వర్గచైతన్యముంది. కవిత్వం విప్లవాచరణలో భాగంఅన్న అవగాహనా ఉంది.

కె. రాంమోహన్‌రాజు "రోడ్డుమీద సూర్యుడు" మంచికవిత. రోడ్డుమీద సూర్యునిబిడ్డలు ఊరేగింపుదీస్తుంటే "రోడ్డంతాకదిలి కదంతొక్కుతున్న సైన్య సంగీతం"విని "ఊరిమీద అలవోకగావాలిన మబ్బుతునక" చిన్నపిల్లాడిమల్లె బెదరి పారిపోయింది. "గాలికి మతిభ్రమించి వెర్రిగాపరుగెత్తింది" అలాగే వర్గశత్రువు

గుండెలదిరాయని కవి చెప్పకచెప్తున్నాడు. విప్లవవీరులకు గెలుపుఖాయం. రేపటి నుండి ఆ సూర్యకిశోరాలే సూత్రధారులు.

ఇంతవరకూ ప్రపంచ మంతా ఆభాసనాటకం
ఇంకనాటకం రక్తికడుతుంది.

వర్గసమాజంలోని భౌతికసంపద, ప్రపంచం పరాయీకరణ ప్రభావంవల్ల సమాజం లోని అత్యధిక సంఖ్యాకులకు "ఆభాస నాటకంగా" కన్పిస్తుంది. పాలకవర్గాల చేతుల్లోకి పరాయీకరణచెందిన ఈ భౌతికసంపద యొక్క చైతన్యరూపాలయిన నైరూప్య ధర్మం, న్యాయం, నీతులే సత్యమనిపిస్తాయి. ఈ ఆభాసనాటకాన్ని అంత మొందించగలది విప్లవమే అని సూచిస్తాడు రాంమోహన్‌రాజు. ఈ కవితలో నాటక ప్రతీకను కవి వాడుకొన్నతీరు ప్రశంసనీయం. కాని "అగ్నితూలికల ఉష్ణీషాలు" "సూర్యసంతానం" వంటి భాషను వాడటంవల్ల కవిత కొంతవరకు తేలిపోయినట్లని పిస్తున్నది.

"అవును, అతడూ మనిషే" (వరవరరావు).

పుట్టినపుడు అతని పేరు మనిషి
పెరిగినపుడు అతని పేరు మనిషి
పొట్టకూటికి పోలీసు నౌకరీలో చేరగానే
అతని పేరు లాఠీ, జైలు, వ్యాను, తుపాకీ.

అతడు పోలీసు కానిస్టేబులు. వర్గసమాజంలో పాలకవర్గాల దోపిడి నుంచి పుట్టిన అధికారాన్ని సంరక్షించడానికి ఏర్పడ్డ యంత్రాంగంలో భాగమైన రక్షణశాఖలో చిరుద్యోగి, సేవకుడు. శ్రామికవర్గం నుండి వచ్చినవాడే అయినా "బూట్లడెక్కల చప్పుళ్ళ"లో, "కడక్‌డ్రెస్‌ల కరకరల"లో తనూ మనిషే అన్నమాట మరిచిపోయి దోపిడీ సంబంధంలో అధికారవర్గాల తరఫున "లాఠీ, జైలు, వ్యాను, తుపాకీ" అవుతాడు. పసిపిల్లలకుగూడ భయం చెప్పడానికి అర్భకురాలైన తల్లికి పనికొచ్చే "బూచి," "తోటి పిల్లలతోకలిసి తన పిల్లలు కూడ / గేలిచేసే, రాళ్ళువిసిరే టార్గెట్." (మన హైదరాబాదు విద్యార్థుల భాషలో "ఖట్‌మల్" అంటే నల్లి) కూడ అవుతాడు. కాని "పాదాలు నేలను, నిజశరీరం గాలిని / తాకినపుడు అతడు మనిషి." తన పిల్లలతో, భార్యతో, తనవాడలో, తనవూళ్ళో, తనవాళ్ళలో ఉన్నప్పుడు అతడు మనిషి అవుతాడు. అప్పుడు "కాకీదుస్తులు నిర్జీవంగా / చూరుకు వేళ్ళాడుతుంటాయి."

బూట్ల డెక్కలచప్పుళ్ళు, కడక్‌డ్రెస్‌ల కరకరలు ఎలాగైతే వర్గపీడననూ, వర్గస్వభావాన్నీ తెలిపే ప్రతీకలో అలాగే కాకీదుస్తులుకూడా పాలకవర్గాల సేవకుడిగా మనిషిగా ఏకకాలంలో అతనిలో వ్యక్తమయ్యే వర్గవైరుధ్యానికి పరాయీకరణకు ప్రతీక. కాకీదుస్తుల్ని విసర్జించి తనవాళ్లెవరో కానివాళ్లెవరో గ్రహించినపుడు, అంటే వర్గ స్పృహ కలిగియున్నపుడుమాత్రమే అతడు మనిషవుతాడు. (ఈ కవితలో వరవరరావు వాడినభాష, శైలీ, సామాజికసంబంధాల సంపూర్ణావగాహన, విప్లవ చైతన్యం, అంతకుమించి వ్యర్థపదంలేకుండా, అస్పష్టత ఏమాత్రంలేకుండా ప్రతీకల్ని వాడేమెలకువలు— విప్లవ కవితాచరణాల ఎత్తుగడలు— విప్లవాచరణలో భాగం కవిత్వం అన్నవిషయానికి ఆయన ఎంతప్రాముఖ్యత ఇస్తాడో తెలుపుతాయి.)

అజ్ఞాతసూరీనికవిత "రెడ్‌శాల్యూట్ డియర్‌ఛైర్మన్" గుణంలో విప్లవ కవిత్వానికి "సెంట్రీ"లాంటిది. పోరాటంలో కామ్రేడ్సందరూ సుఖమెరుగని నిద్రలో ఉన్నపుడు

నేనుమాత్రం మేల్కొనే ఉంటాను సెంట్రీచేస్తూ-
ఈ చీకటిరాత్రి అంతంచూసేవరకూ-

ఈ చీకటిరాత్రి కామ్రేడ్సందరూ అలసినిద్రించే రాత్రిసమయంమాత్రమే కాదు. వర్గదోపిడీజరిగే చారిత్రికదశకూడ. తోటివిప్లవకారుల, శ్రమజీవుల రక్షణకోసమై జాగరూకతతో సెంట్రీచేసేవాడు విప్లవకవి, అజ్ఞాతసూరీడు.

ఇక"రోడ్డుక్రాస్‌చేస్తా" (సందినిసిధారెడ్డి), "అంకితం" (గుడిహాళం రఘునాథం), "నగరం సాలెగూడు" (సుంకిరెడ్డి నారాయణరెడ్డి), "అక్షరమైజ్వలింప చేస్తావు" (జయధీర్ తిరుమలరావు) అన్నకవితల్లో మంచివచనకవితకు కావలసిన టాలెంటు కన్పిస్తున్నది. కాని విప్లవకవితకు కావల్సిన చారిత్రక భౌతికగతితర్క జ్ఞానం, సామాజికసంబంధాల అవగాహన, విప్లవచైతన్యం లోపించినట్లు కన్పిస్తున్నది. శ్రామికజనపక్షపాతం, శ్రమజీవనచైతన్యం అంటే సిధారెడ్డికి యాంత్రికమైన అవగాహన ఉన్నట్లుంది : "జరరికార్డులవుతావా ? / బావిమీద బట్టలుతుకుతున్న శబ్దంవినాలి / బావురుమంటున్న చంటిపిల్లాడి గుండెకోతవినాలి / ఈ పూలదండలు కాస్తాతీస్తావా ? / పొలానికెళ్లి మెడమీద కాడిమొయ్యాలి." గుడిహాళం రఘునాథం "రా, అన్నారా, రా / ఇల్లొదిలి, బారొదిలి / తడితడివెన్నెలల చంద్రబింబాల్నొదిలి / ....మనం సముద్రంలో కలుద్దాం" అంటాడు. ఏమాత్రం

అజాగ్రత్తగా ఉన్నా వచనకవిత్వంలో దానికి స్వభావసిద్ధమైన వ్యంగ్యం, కవి దాన్ని ఉద్దేశించని పక్షంలో, వస్తువును వికటింపజేస్తుంది. “జనాల్లో అల్లుకుంటున్న గహనాటవులు” అన్న ప్రతీక అర్థం ప్రజలతో ఏకమవుతున్న నక్సలైట్లనా? నక్సలైట్లు పల్లెప్రజలకూ, గిరిజనులకూ దగ్గరగా ఉండటానికి, రహస్య జీవనంకోసం అడవుల్లో నివసిస్తే నివసించవచ్చుగాక, వాళ్ళు జనంగుండెల్లో ఒదిగున్న అజ్ఞాతసూరీళ్ళన్న అవగాహన విప్లవ కవికుండాలి.

సుంకిరెడ్డి నారాయణరెడ్డి నగరాన్ని “కరెంటు తీగలతో అల్లిన అందమైన సాలెగూడు”తో పోలుస్తాడు. బాగానేఉంది. కాని ఏడవభాగంలో “ఒకప్రాణిని భూమ్మీదకు తేవడం” అన్న సృష్టిక్రియం కార్మికుల్లో “అందుగుల పొడవు గుడిసె కూడా” లేకున్నా ఆగదు. “తహ తహలాడే రేపటి ఎర్రకోట వాళ్ళనాగనివ్వదు / రేపటి ఎర్రకోటమీద ఎగిరే / ఎర్రజెండాను తేవడానికి” అంటాడు. శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఏర్పాటుచేయాల్సిన చారిత్రకావసరమే కార్మికులు పిల్లల్ని కనేలా చేస్తుంది అన్న అర్థంస్ఫురిస్తుంది ఈ లైన్లలో. ఇతరత్రాబాగున్న యీ కవిత ఈ దోషంవల్ల పనికిమాలినదైంది. జయధీర్ తిరుమలరావు తన కవితలో అంటాడు: “రణం సిరా అవుతుంటే / సిరా అణువుల్ని అగ్గికొలుములు చేస్తుంటే / అభ్యుదయం పేరుతో గేయాలు వల్లిస్తున్నారు వీళ్ళు” సిరా అంటే ఇంక్ అనేనా? రణం సిరా కావడం అంటే వర్గపోరాటం కవిత్వంగా మారటమనా? సిరా అణువుల్ని అగ్గి కొలుముల్ని చేయడం అంటే? ఈ రకమైన అస్పష్టత కవిత్వం గురించి, విప్లవ చైతన్యం గురించి సరియైన అవగాహన లేకపోవడంవల్ల వస్తుంది. “కష్టాల కాష్ఠాల్లో చేతులుకాపు”కోవడమంటే? “బహుమతుల బాంధీ” అంటే? శబ్ద చాపల్యం గర్హనీయమైందేమీకాదు కాని అర్థాన్ని త్యాగం చేయడం ఎందుకు?

మొలీనాకవిత “కొన్నివాక్యాలు” బాగుంది. రాబోయే కొత్త ప్రపంచంలో “....కవిత్వం / ఇంకెంతమాత్రమూ యుద్ధాలు చెయ్యదు.” అన్న భావనబాగుంది. కాని విప్లవాచరణగా కవిత్వానికున్న పాత్ర ఎప్పుడైనా అంతమౌతుందా? అన్న అనుమానం నాకు.

మర్రి విజయరావు కవిత “ఆకలిజెండాల”నుబట్టి నేనర్థం చేసుకున్నంతలో ఈ కవి ఇంకాంచెం కృషిచేస్తే మంచి విప్లవ వచనకవిత రాయగలడు. “పరిశోధనల రొయ్యమీసాలకు ప్రయోగశాల”(అంటే అర్థం?)లైన పల్లెన్న. పోచన్నల వా

చైతన్యంతో ఐక్యమయి వారి భాషలోంచి, బ్రతుకులోంచి, వర్గసంఘర్షణలోంచి ప్రతీకల్ని ఎంచుకుని వాటికి విప్లవ చైతన్యాన్ని జోడిస్తే మంచి కవికాగలడు.

ఏ. ఎస్. కవిత "జగిత్యాలపల్లె" 'పోరాటంచేస్తున్న పల్లెకుప్రతీక' అజ్ఞాత సూరీని కవితలోవలె పోరాటవాతావరణాన్ని కవి ఈకవితలోకూడా సృష్టించారు. గోదారికవిత "ఇదిఎలిజీకాదు" శీర్షిక. "ఇది వచనరూపంలో కవిత్వంచేసుకున్న ఆత్మహత్య"అంటే బాగుండేది. ఎస్. కె కవిత "భద్రిత"లోకూడా మంచి విప్లవ కవితాచరణాల ఎత్తుగడలుకన్పిస్తాయి. మచ్చుకు- "గుండె భూమికమీద / కన్నీళ్ళకవి నాగళ్ళుదున్నాలి / అక్కడొకనిజం దొరుకుతుంది / మట్టి పైపొర కిందినించి / పికిలివచ్చిన సారంవలె / భయం తెరతొలిగి తెగింపు / కన్నీళ్ళపొరచాటున మెరిసే కత్తి." వర్గకసి శ్రామికవర్గచైతన్యంగా అంటే స్వేచ్ఛగా, విప్లవపోరాటంగామారే క్రమానికి ప్రతీక.

నిజం "కళ్ళు" మంచివచనకవిత. ఈదేశంలోని "శ్రమదోపిడి స్వేచ్ఛా స్వర్గం"లో ఓర్వలేక ఎర్రగారాజుకుంటున్న చూపుల్ని "మరమ్మతు చేయాలని / వాటికి 'కొత్త' చూపుల్ని అతకాలని ఈ జాతిని / మళ్ళీ మా (తమ) దారిలోకి తీసుకు రావా"లని పాలకవర్గాలు "కళ్ళరవాణా", "నేత్రహింస" మొదలుపెట్టాయి. అయితే కళ్ళరవాణాఅన్న ప్రతీకమాత్రం అస్పష్టంగాఉంది. ఈ వచన కవితకుకూడా ప్రాణం వ్యంగ్యం వల్లే వచ్చింది.

అజంతా ఆధునికకవుల్లో ప్రతిష్ఠకలవాడు. వచనకవిత బాగారాయగలిగిన వాడన్న పేరుఉంది. "అగ్నిస్పర్శ"అన్న శీర్షికగల ఆయన కవితలోవస్తువు ఆత్మాశ్రయమైన "బాధ". బాధఅన్నా, బాధాగ్నిఅన్నా, బాధాగ్నికుసుమమన్నా అన్నీవొక్కటే అతనికి. వాడుకవిలువ, మారకపువిలువలచే ప్రభావితమైన వర్గసమాజంలోని చైతన్యరూపాలన్నీ పరాయీకరణచెంది సమాజాన్నుండి మనిషిని, మనిషినుండి అతని గుణాల్ని దూరంచేశాయని చెప్పవచ్చు. న్యాయం, ధర్మం, నీతిమొదలగునవి ఎలా పరాయీకరణచెందిన చైతన్యరూపాలో, అలాగే బాధ, నిరాశ, ఒంటరితనం వంటివి పరాయీకరణచెందిన మనిషిలక్షణాలు. అందువల్లనే అర్ధభూస్వామ్య భావ జాలంలో చిక్కుకున్న మధ్యతరగతికవుల చైతన్యంలో ఈ లక్షణాలన్నీ కన్పిస్తాయి.

బాధాగ్నికుసుమాన్ని ఆఘ్రాణిస్తున్నప్పుడే
క్షణాలమధ్య అగాధంలో స్వప్నచషువులకు నిషా.

ఈ లైన్లలో "బాధ" బూర్జువాసమాజంలోని మనిషిలక్షణం అయితే (బాధాగ్ని) కుసుమాన్ని ఆఘ్రాణించడం పరాయీకరణచెందిన వాడుకవిలువచే ప్రభావితమైన భావవాద్య చైతన్య లక్షణం. "బాధాగ్నికుసుమాన్ని ఆఘ్రాణిస్తున్నపుడే," అంటే కవి బాధపడ్తున్నపుడే "క్షణాలమధ్య అగాధం" యింకాతీవ్రంగా అతని అనుభవానికొస్తుంది. అనగా బాధపడే కవికి కాలంసరిగాగడవదు. క్షణాలమధ్య అగాధం మారకపువిలువచే ప్రభావితమైన బూర్జువావ్యక్తులమధ్యఏర్పడే అగాధంవంటిది.

బాధపడుతూ సమయం భారంగాగడుస్తున్నపుడు కవి స్వప్నంలోకి జారుకొని కలలుకనడం మొదలుపెడతాడు- ఆ కలలో అతనికళ్ళకు ("చక్షువుల"కు) బాధాగ్ని కుసుమాన్ని ఆఘ్రాణించడం నిషాకల్గిస్తుంది. (చక్షువులకుబదులు "నాసిక"అంటే బాగుండేమో) ఆ నిషాలో అతడు "ఖడ్గధారలమధ్య క్షతగాత్రుడైనా అప్పుడు ఉజ్వలంగానే ఉంటాడు." ఆ నిషాభావవాద్య చైతన్యంలోని భ్రమవంటిది, భ్రాసకంవంటిది. అటువంటి నైరూప్యభ్రమలో చిక్కుకున్న వ్యక్తిశరీరం గాయాలతో చిల్లులుపడ్డా కాంతివంతంగానే ఉంటాడు కవి అజంతా ఊహల్లో. ఈ కవిత అంతా ఇటువంటి వర్గచైతన్యాన్ని ప్రతిఫలించే ప్రతీకల్తోనే నిండి ఉన్నది. ఈ రకమైన వైరుధ్యాల్తో నిండిన కవితలోని అస్పష్టత వచనకవిత్వానికి బలాన్నిస్తుందని బూర్జువా సాహిత్యవిమర్శ భావిస్తుంది. ఈ కవికి తన బతుకు ఒక సంగ్రామం: "జీవన సంగ్రామం". వర్గయుద్ధంకాదు. వర్గసమాజంలో మధ్యతరగతి వ్యక్తి ఒంటరిగా జేసే పోరాటం. ఇలాంటి కవిత కూడా "ఈతరం యుద్ధకవిత"లో ఎలా చేరింది?

ఇక చివరగా నగ్నముని, "కొయ్యగుర్రం". మొదటిలైను "జీవితం మిథ్య అనడం అబద్ధం" అని. జీవితం మిథ్య అన్న భావం శ్రమశక్తి పరాయీకరణలో వృద్ధిచెందిన పాలకవర్గ చైతన్యం సృష్టించిన భావం. ఈ భావం అబద్ధమని కవి అంటాడు. కరెక్టే. కాని ఆరవలైన్లో "మానవత్వం బతికే ఉందనటం అబద్ధం" అంటాడు. మానవత్వమనేది నైరూప్య మానవలక్షణం. ("జీవితం" అన్నపదం కూడా నైరూప్యార్థంలోనే కవి తీసుకున్నాడా?) నిజానికి మనిషికుండేది ఆయా వ్యవస్థల్లో ఆయావిలువలచే ప్రభావితమైన ప్రత్యేక వర్గలక్షణాలు. మనిషి బతుకు గురించి స్వభావం గురించి ఈ విధంగా నైరూప్య ధోరణిలో ఆలోచించడం పాలక వర్గచైతన్యానికి నిదర్శనం. "మనిషి శతాబ్దాలు గడిచేకొద్దీ నాగరికుడవుతాడనడం అబద్ధం" అని కూడా అంటాడు. ఇది చారిత్రక, భౌతికగతితర్కానికి సరిగ్గా వ్యతి

రేకమైన యాంత్రికభావం. అలాగే "మనిషిలోని అన్ని అంగాలూ జంతువులుగా మారడానికి / జీవితాంతం ప్రయత్నిస్తాయి" అనడం కూడా.

అందువల్లనే జీసస్, బుద్ధుడూ ఈ కవికి ఆరాధ్యులు. భూస్వామ్య భావజాలంలో శక్తికీ, పీడనకూ, విశ్వాసానికీ ప్రతీక అయిన గుర్రం, ఈ కవికి "పరిపాలనా దార్ఢ్యానికి సంకేతం" శవాలతోనూ రాజకీయం నెరపగల్గిన, సముద్రం చంపిన శవాల్ని ఖాళీ చేయడానికి కంట్రాక్టర్లను పెట్టిన ప్రభుత్వానికి సంకేతం కొయ్యగుర్రం. సకలసంపదల్నీ, తల్లిదండ్రుల్నీ, పెళ్ళాంబిడ్డల్నీ "పరిత్యజించిన సిద్ధార్థుణ్ణి / రాజ్యం బయటివరకు చేరవేసి తిరిగొచ్చిన అశ్వం / అశ్రునయనాల్తో నాగార్జున కొండలో ఇంకా నిలబడే వుంది / మానవుడి మనసులో మాత్రం మహాబోధిఎప్పుడో కూలిపోయింది". సిద్ధార్థుడు ప్రజలకోసం సర్వసంగపరిత్యాగ మార్గాన్ని చేపట్టితే, ఆ మార్గాన్ని సంఘక్షేమం కోసం పాలకవర్గాలకు రికమెండ్ చేస్తే ఆ మార్గానికి అశ్వం సంకేతమవుతుంది. ఆమార్గాన్ని ఏపాలకవర్గమైనా చేపట్టి ప్రజాసేవచేస్తే అశ్వం వారిపరిపాలనాదార్ఢ్యానికి సంకేతం అవుతుంది. కాని చరిత్రలో అలాజరిగినట్లు దాఖలాలులేవు. అది భూస్వామ్యభావజాలం ఉత్పత్తి చేసిన భ్రమ. అయితే భూస్వామ్య విలువలకూ, పెట్టుబడిదారీ విలువలకూ మధ్య వైరుధ్యం అశ్వం - కొయ్యగుర్రింల మధ్య అంతరంలో సరిగానే సూచితమవుతున్నది.

"ఈ కొయ్యగుర్రాన్ని తగలబెట్టగల కొత్త ఇంధనం కనిపెడతాను" అని కవి అంటాడు. కాని ఆ ఇంధనం మాత్రం వర్గపోరాటం, శ్రామికవర్గనియంతృత్వంగాదు.

కొత్తకలల్తో కొత్త విశ్వాసాల్తో
విశ్వవస్త్రంనేసి
తిరిగొచ్చి
దిసమొలగా దిక్కులమధ్య దిక్కులేకుండా
పడిఉన్న మనిషి ఒంటిపై
కప్పుతాను

కాని ఆ ఇంధనం నిర్దిష్టంగా ఇది అని చెప్పలేడు. కొత్తకలల్తో కొత్త విశ్వాసాల్తో నేసే విశ్వవస్త్రం ఆ ఇంధనానికి సంకేతమా ? నగ్నముని ఇంకా దిగంబర కవితా సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నాడా? అయితే ఈ కవితను "ఈతరం యుద్ధకవిత"లో చేర్చుకోవడం ఎందుకు ?

సింగరేణి కథలు :

# ఇంధనం

కార్మిక

"ఏదేమైన మనం ఇట్లాగే 'ఒక్కడుగుముందుకు రెండడుగులు వెనుకకు' అనుకుంట కూసుంటె మన పనితోబాతోబా.... మన లెనిన్ను, మార్క్సును ఎవడడి గింటు.... ఒక పక్క ఐయోడు (కాంగ్రెసుఐ నాయకుడు) బాయిలమీదికచ్చిపోతండు వాళ్ళ కార్యకర్తలు 'మావోడు లేబర్ మినిష్టరని. అది చేయిస్తం. ఇది చేయిస్తమని' ఊదరగొడుతండు.... ఇంకోపక్క రాడికలోల్లు పోస్టర్లమీద పోస్టర్లేస్తండ్లు. మనమే ఎనుకబడిపోతిమి." సుల్తాన్ కుర్చీలో తెగమెసలుతూ, మాటిమాటికి చేతులు విసురుతూ చెప్పుకొచ్చాడు.

"సాసాబ్! మనకు చందాలిచ్చేటే బందయిపోతయి." లింగం సుల్తాన్‌కు మద్దతుగా అన్నాడు.

వాళ్లకెదురుగా కుర్చీలో కుదిమట్టంగా కూర్చున్న సూర్యారావు ఆమాటలు వింటున్నాడో లేదో అన్నట్లుగా తాళ్లావుతూ కూర్చున్నాడు. టేబిల్ మీద పేపర్ వెయిట్ తిప్పాడు.... వాళ్ళ అట్లా బడలబ వాగుతుండగానే ఊ అనకుండా ఉప్పురాయన కుండా దూరంగా పల్చబడుతున్న ఉదయపు బొగ్గుపొగలకేసి చూస్తూకూర్చున్నాడు. యూనియన్ ఆఫీసు ముందటి ముడుచుకపోయిన కంకికొడవలి గుర్తుగలిగిన జండా కేసి చూశాడు.... 'రంగు వెలిసిపోయింది కొత్తది మార్పించాలి' అనుకున్నాడు మనసులో. వీధిలో అట్టే మనుషులు తిరగడంలేదు.... ఒకరోయిద్దరో తలలు వంచు కొని పోతున్నారు.... "వాళ్ళు ఏం ఆలోచిస్తున్నారో?" బరుగ్గిబరుగ్గిన తిరిగే ఆటోలు కూడా తిరగడం లేదు.

దగ్‌దగ్‌మని శబ్దంచేస్తూ డీసిల్ జీబు ఆఫీసు ముందునుండి వెళ్ళిపోయింది. అందులో ముందుసీట్లో ముఖం మాడ్చుకొని కూర్చున్న యస్ ఐ రెడ్డి ఓమారు ఆఫీసు లోకి మారేసిచూసిన చూపు. ఆఫీసుముందు దూరంగా వేపచెట్టుకింద పాతబట్టలమ్మే వాడు గిరాకీలేక తీరిగ్గా దుమ్ముదులుపుకుంటున్నాడు.... ప్యాలెంతర్లవాడు ఒక్కొక్కటే నేలమీదపరిచి గులకరాళ్ళు పెడుతున్నాడు.

"ఏదో ఒకటి చెయ్యకపోతే యూనియన్ చెలాయించుడు మన వశంగాదు. మీకేం మీరిక్కడుంటరు. పిట్‌ల మీద దెంగులు దినేదిమేం...." సుల్తాన్ ఆఖరు మాటగాచెప్పి గడ్డంగోక్కుంటూ కూర్చున్నాడు....

లింగం తనేదన్నా ఇలాంటిమాట మాట్లాడుదామనుకొనే నోరుతెరిచాడు. ఏ మాట తట్టక టేబుల్‌నుచూస్తూ నెత్తిగోక్కొని నోరుమూసుకున్నాడు.

రావు ఇద్దరిని సాలోచనగా చూశాడు. ఎండలోవచ్చారేమొ చెమటపట్టి, కొద్దిగా అలిసిపోయినట్లున్నారు. వచ్చేరాకడలో ఎవరితోనైనా తగువుపడ్డారేమొ ?

"ఒరే రాముడూ ! మూడుకాఫీపట్టుకరా !" రావు బయటకు కేకేశాడు.

దరువాజదగ్గర ఒక్కడే అట్టచెమ్మ ఆడుకుంటున్నరాములు పరుగెత్తుకెళ్లి మూడుకాఫీలు పట్టుకొచ్చాడు.

కాఫీలు తాగడమైపోయింది. రావు సిగరెట్టు ముట్టించాడు. సిగరెట్టు సగం దాకా తాగి పొగనోటితోనే కడుపుల చల్లకదలకుంటా మెల్లెగా "సుల్తాన్ కమ్యూనిస్టులకు వేగిరపాటుతగదు. వింటున్నారా ? ఎద్దు ఎగురగానే గంటెగురుతదా ? మనం పుట్టినదగ్గరినుండీ కాంగ్రెసువాళ్లు మనతోపాటే ఉంటున్నరు. వాళ్ళపాలసీ మనకు కార్మికులకు కొత్తా ? ఎన్నేండ్లబట్టో అదేపాతరికార్డు. మనం యూనియన్‌బెట్టినకాన్నుంచి కాంగ్రెసోడే లేబరుమినిష్టరు. కనుక వాళ్లు ఏదిచేయిస్తమన్నా నమ్మరు. ఇక రాడికలోల్లసంగతి. కొత్తబిచ్చగాడు పొద్దెరుగడని - వాళ్లు కొత్తగ రంగంల కొచ్చిండ్లు. మేమూచేసినమోయి పోరాటం. తుపాకులు ఖజానబెట్టినం. అడవుల్లో దళాలుగట్టినం. నైజాంసర్కారును గడగడలాడించినం. పిడుక్కు బియ్యానికి ఒకే మంత్రింకాదు మార్క్సిజం అంటే. శాంతియుతంగా మార్పువస్తుంటే ఈ గడబిడలెందుకు ? ఎన్నికలున్నయ్. పార్లమెంటులున్నయి. చేతనైతే జనంచేత ఓట్లేయించి అధికారంచేపట్టు. వీళ్ళేంది, స్టాలిన్ ఉరుకులాడితే అతనిగతేమయ్యింది, అందుకే లెనిన్ ఏమన్నడు ?" ఏసందర్భంలో లెనిన్ ఏమన్నాడో కాసేపుగుర్తుకురాక కనుబొమలు ముడిచి ఆలోచించి లెనిన్‌మాటగా తనుచెప్పేమాటకోసం ఆగి అది గమనించ గలరేమొనని ఎటోచూస్తూ "ఇదిగో ఇది చదవండి. మన నాయకుడు ఉపేందర్ "కార్మికసంఘాల్లో అరాచకవాదం అని చక్కని వ్యాసంరాశాడు." అని టేబుల్ సొరుగులోనుండి ఓపుస్తకం తీసియిస్తూ....

ఆ పుస్తకం తీసుకొని అటూయిటూతిప్పి "వాళ్ళకేంది సార్ పైనుండి వ్యాసాలురాస్తరు.... మొఖాఓలాకర్‌నేవాలేకు మాలూమ్ తందానా. (ఎదురుకునే వాళ్ళకు కష్టాలు తెలుసు) గీ పుస్తకాలెవడు సదువుతడుసార్ ! దంగల్‌మేఁజో లఢాయి కర్తా ఉస్‌కా బాత్‌సున్తే (మైదానంల ఎవడు కొట్లాడ్తవాని మాటింటరు.) ఈపుస్తకంల

ఏంరాసినా మనం సమ్మెనోటీసు యివ్వకపోతే కలువది. మేనేజుమెంటు చంచా సముద్ఘేలోగ్.... బాయిలమీద అట్ల ముఖసమీదనే అంటండ్లు. వాళ్ళంతా సమ్మెలు చేస్తుంటే మనం వద్దుమొర్రో అంటేకలువది." సుల్తాన్....

"బాసార్ ఒకసారి మన తడాఖా చూయించాలే." లింగం సమ్మె మాటవినగానే సంబరపడ్తూ అన్నాడు.

"చూద్దాం.... మన వాళ్ళతో మాట్లాడాం...." రావు....

"మన వాళ్ళంతా రడీయేసార్." లింగం....

"మన హైదాౖబాద్ నాయకులతోనయ్యా." రావు అసహనంగా....

మరింక లాభంలేదని సుల్తాన్-లింగం చల్లబడ్డారు....

కాసేపు ఆమాట ఈమాట మాట్లాడి "ఎట్లున్నది వాతావరణం...." రావు సుల్తాన్‌కేసి చూస్తూ అడిగాడు.

"ఏమున్నదిసార్! బాయిబాయికి పోలీసులు తిరుగుతున్నరు. మొన్న వెంకటాౖపూర్ పల్లెమీద దాడిచేసి 20 మంది రాడికల్స్‌ను పట్టుకొచ్చిండ్లట. వాళ్ళతోని గోడలమీద నినాదాలు తుడిపిస్తున్నరట."

"అః అంతమంది రాడికల్సేనా? లట్టుగాన్ని పొట్టుగాన్ని పట్టుకొచ్చిండ్లు- అందుల మన దుర్గయ్యను కూడా పట్టుకొస్తే విడిపించలేదా? మన దుర్గయ్య రాడికలేనా?" రావు.

"ఘనోడో మందోడో ఎట్లతెలుస్తదిసార్! అట్టకట్టుంటే మాకెలవుడ చదో అని వ్యానెక్కిచ్చుకత్తండ్లు. మొన్న వెంకటాౖపూర్ పల్లెన అయిలయ్యని మావూరోడు డ్యూటీ దిగొచ్చి అంపులకాడ తానంజేస్తండట. అమీన్‌జీబు ఆపి ఉరికొచ్చిండట అయిలయ్య 'దండందొరా అని చేతులు జోడించిండట.' అరెనువ్వు రాడికలోనివి గావు కాంగ్రెసువి అని వెళ్ళిపోయిండట. అగో అది బండగుర్తు...." లింగం.

రాములు లోపలికి తొంగిచూసి "దండందొరా అని పబ్బతి బట్టినోడు కాంగ్రెస్‌వి అయితే మరి మనోళ్లు ఆయేల్లన ఏంచేస్తరు లింగంసారు" అన్నాడు.

"ఏంచేస్తం పోరాటంచేస్తం" లింగం.

"మరి రాడికలోల్లు"

"నువ్వాగురాములు అడ్డలబుడ్డోలే" అన్నాడులింగం గుటికిల్లుమింగి.

"ఎవరన్న అసలోల్లుదొరికింట్లా ?" రావు

"వాళ్ల దొరుకుతరాసార్ !" సుల్తాన్.

లింగం హటాత్తుగా ఏదో గుర్తుకొచ్చినోనిలాగా ముందుకువంగి "ఎప్పన్నుంచో అడుగుదామనుకుంటన్నసార్ ! ఇగో పోలీసోల్లు టాట్ ఫీల్‌మని మీదికి ఎంతభీకరంగ తిరిగిన లోపట పింజాం పింజాం అంటలేదాసార్ ? అమీన్‌రెడ్డి శ్రీబులకూతుంటె పక్కకెపలు కూసుంటలేరట. ఎవనికి పాణమంటె పట్టిలేదుగన్క. ఇంటికిబోతే పెండ్లాం గజగజ అనుక్కుంట తెల్లందాకా తెలివితోటే ఉంటన్నదట. ఏనాత్రో ఏ పగలో ఎవడచ్చిమీదబడ్తడోగదా ! ఎందుకుసార్ వీనికి ఎవలకులేనిపట్టింపు. అందరు తోడుదొంగలేనాయె. ఈ జిల్లల వీడేమొనగాడున్నడా ? మీద ఇందిరమ్మ కోట్లకు కోట్లు మింగుతంటె. వీడేమొ సత్యహరిచంద్రుని సడ్డకునోలె ఆమెకింత నౌకరి చేసుకుంట వీని తాతసొమ్ముబోయినట్టు ఎగురుడు. ఏదివీనికేగావాలే. మంచి మంచోల్లు మన్నయిపోంగ దూదేకులమియ్యకేంది ? దొసార్ మొన్న పిస్తోలుగుండు తాకిందేఅనుకో ? ఏమయ్యేది ? పెండ్లాం ముండమోసేది ? పిల్లలుదిక్కులేనోల్లయే టోల్లు. సర్కారు వీనికేం పీకిపెట్టేవి ?" లింగం ఇంకాచాలా చెప్పాలనుకున్నాడు.

"గవ్వన్ని మనకెందుకు ? వాకుటయిమయ్యింది. మనకు సాగుతందని అరాచకం చెయ్యబోతె ఏగవర్నమెంటు ఊర్కుంటది" రావు కుర్చీలోనుండిలేచాడు.

ఇంతలోనే ఫోనుమోగింది.

"హల్లో ! నేను ఎఐటియుసి రావును మాట్లాడుతున్న. ఆఁ ఫైవింక్ లైన్‌ల (5వ నంబరు బొగ్గుగనిలో) సమ్మెనా ? ఎందుకోంట ? సానుభూతిగానా. ఎవరికీ సానుభూతి ? ఎందుకుసానుభూతి ? అరరె! సిక్సింక్లైనుకూడా సమ్మెలోఉందా ? ఆశ్చర్యంగా ఉందే ? ఎప్పుడు మొదలయ్యింది ? నైటుషిఫ్టునుంచా....మాకు...." రిసీవర్ మూతికి చెయ్యడ్డంబెట్టి "చూశారా ?" అన్నట్లు సుల్తాన్ లింగం కేసిచూసి, మళ్ళీ.... "హల్లో ఇప్పుడు ఆఫీసులో నేనొక్కన్నేఉన్నా. బహుశా మాకార్యకర్తలు అందుకేనేమొ నాకు కనిపించలేదు. వాళ్లు అక్కడికే పోయిఉంటారు. నాకైతే విషయంతెలియదు సరె లెండి. ఎట్లాగో అట్లాగా ఐకెన్ మానేజ్" రావు నీరసంగా ఫోన్ పెట్టిండు.... ముఖం ముడుచుకపోయింది.

"చూడండి మనమిక్కడ బాతాఖానీ చేసుకుంట కూర్చుంటే నైట్‌షిఫ్టునుండి సిక్సింక్లైన్లో (6వ నెంబరుబావి) సమ్మెమొదలయ్యిందట. వాళ్ళకు సానుభూతిగ

వింక్లైను వాళ్ల ఉదయం షిఫ్టునుండి సమ్మెలోచేరారట. ఓహ్ బాస్టర్డ్స్ ....బాపులు బాపులుగా ఉండడంలేదు. దగ్గినా పిత్తినా సమ్మెలే. ఓప్రొసీజర్ లేదు పాడులేదు. లీగల్ ఇల్లీగల్ తెలియదు. కనీసం ట్రేడ్ యూనియన్ .... సరేసరె మీరిద్దరు సిక్స్ంక్లైను కు వెళ్ళండి. ఈలోగా నేను ఫైవింక్లైన్ చూసుకొని అటుకేసివస్త." గబ గబ చెప్పాడు. రావు ఎర్రటిముఖం కందిపోయింది.

సుల్తాన్ లింగం ఒకరిముఖాలొకరు చూసుకొని లేచి బయటకు నడిచారు. లింగంకు బాగాకోపంగాఉన్నది. పాదాలు ఎత్తిఎత్తివేస్తూ చేతులూపుతూ ఒక్క మాటన్నా మాట్లాడకుండా నడిచాడు. సుల్తాన్ నాయకుని ఆలోచనలుచేస్తూ నడిచాడు.

రావు చెప్పులు టకటక లాడిస్తూ బయటకొచ్చాడు. పరాకుగానే కాకుండా చిరాకుగా కారుకేసి నడువబోయాడు. డగ్ డగ్ మని చప్పుడుచేస్తూ డీసిల్ జీబొచ్చి ఆగింది. వేపచెట్టుకింద పెద్దగా ఏదోచెప్పుతున్న పాతగుడ్డలవాడు టక్కున నోరు మూశాడు.

జీబులోనుండి టోపీలేని బట్టతల వెళ్ళబెట్టి అమీన్ "మీరింకా ఇక్కడే ఉన్నారా? వోమాకెలాడోంకో?" అమీన్ పండ్లుకొరికి ఏదో అన్నాడు జీబుచప్పుడులో మిగతామాట విన్పించలేదు,

రావు అమీన్ ముఖం చూశాడు.... ముద్దచెంపలు, గొంగళిపురుగు మీసాలు. ఖాకీబట్టలు దర్పాన్ని. అధికారాన్ని తెలుపుతున్నాయి. కాని కళ్ళల్లో ఎక్కడో ఓటమి తనకు తెలుస్తోంది.... ఛ కాదేమొ ? వాళ్ళకాఆలోచనలుండవు.... వాళ్ళ....

జీబు వెళ్ళిపోయింది.... రావు ఏదో ఆలోచిస్తూ కార్ డోర్ తీసి స్టీరింగు ముందు కూర్చున్నాడు.... ఇంతలో వేపచెట్టుకింది నుండి మాసిన బట్టలవాడొకడు గబగబా కారు దగ్గరికొచ్చి రావు ముఖంమీద ముఖంబెట్టి "నమస్తేసాబ్" అన్నాడు నిటారుగా నిలబడుతూ.... అంత చిరాకులో కూడా రావుకు కాస్తంత రిలీఫనిపించింది ఆమమ్మ మనిషి ముఖంమారిపోయింది. "సాబ్ నన్ను కుక్కను దింపుకున్నట్టు తింపుతుంటండ్లు.... ఇగో నౌకరి అత్తె అత్తదనరాదుండ్లి. లేకపోతే నాపైసలు నాకు పారేయరాదుండ్లి. ఎనుకటెవడో చెప్పినట్టు, ఉన్నది బోయింది ఉంచుకున్నది బోయింది.... ఇగో నేను మా అయ్య సంపాయించిన చెక్క (భూమి) అమ్ముకచ్చిన" కారులోకి వంగాడు....

"అల్లుకుపోతె పిల్లైదురైసట్లు మధ్యల నీదేందయ్యాగోల.... నాజేబులున్నయా ఉద్యోగాలు వస్తదిపొ...." కారుస్టార్టుచేశాడు రావు....

"నీయవ్వల.... మీరంతాఒక్కటే. ఏడికిబోయిన మీదేరాజ్జెం. వస్తది-వస్తదని నన్ను గంగలగలిపిసవ్." వెనుక కాండ్రికిచ్చి ఉమ్మేసింది రావుచూడనే లేదు.

కారు గతుకులరోడ్డుమీద మెల్లెగాపోతోంది. నాయకుడు వేగిరపడ్డట్టు కన్పించ కూడదు. రోడ్డుకు ఇరుపక్కలగల పాన్‌షేలాలముందు నిలబడినవాళ్లు కారుముందు ఎగిరే ఎర్రిజండాకేసి చూస్తున్నారు. మరికొందరు ఏదోపెద్దగా మాట్లాడుకుంటున్నారు. కారులోకూర్చున్న రావుకేసి చూస్తున్నారు. ఇదే రెండుసంవత్సరాలకింద అయితే దారిపొడుగున ఎంతోమంది వంగివంగి సలాములు బెట్టేవారు. ఇప్పుడో? ఆచూపులు.

ఎదురుగా బొగ్గులారీలు ఆగిఉన్నాయి.... అంటే మిగతావాపులు నడుస్తున్నా యన్నమాట.... కారాగింది- లారీల ముందు దున్నపోతులబండి. వళవటి దున్నపోతు కాడేత్తేసి బెదురుతోంది.... ఎగగట్టబడిన ముతకధోవతి రైతు దాన్ని సరిచేయడానికి తంటాలుపడుతున్నాడు....

పాన్‌షాపుల దగ్గరినుండి మాటలు- పీడె్లుండెర సన్నగ పీరిలముద్లె కట్టెతీగ ఉండె- డొక్కుసైకిలేసుకొని బాయిలసుట్టు తిర్గెటోడు ఇప్పుడు సూడు కొడుకు వైభోగం" ఎవడో అన్నాడు.

"షంషొద్దీన్‌గాడు గిట్లనే సింగి బింగాడలేదా?" ఇంకెవడో?

రావు ఉలిక్కిపడ్డాడు. చుట్టూచూశాడు. తన కారుపక్క నుండి నలుగురైదుగురు కార్మికులు ఏదో మాట్లాడుకుంటూ సైకిళ్ళు నడిపించుకుంటూ పోతున్నారు. లారీలవాళ్లు అదేపనిగ హారన్‌లు మోగిస్తున్నారు. రైతు తిడుతూనే బండి రోడ్డుపక్కకు లాగాడు.

లారీలు కదిలినయ్. వాటివెనుకనే కారుకదిలింది. డాంబరురోడ్డు విడిచి అడ్డ దారిన షైవింక్లైన్ బాయిమీదికి పోవాలి. కారు అండర్‌బ్రిడ్జి దాటింది. మూలమీది బల్లలాంటి ముఖంగల వాచ్‌మన్ ఏమేనేజరో అనుకొని సలామ్ చేశాడు. కారు రోడ్డు దింపి ఆపేశాడురావు.

"నేనొచ్చేదాక ఈకారును చూస్తూఉండు." రావు

"అచ్ఛాసాబ్ లాక్‌చేయిండ్లి" అన్నాడు వాచ్‌మన్

రావు పైజామా సరిచేసుకొని లాక్ చేశాడు. ఎండ చురుక్కుమనిపించింది, సూర్యునికేసి దిగాలుగా చూశాడు. వాచ్ చూసుకున్నాడు పదిన్నర "దీని కడుపుగాల పదిన్నరకే ఎండ మాడ్చేస్తున్నది." అనుకున్నాడు. అలవాటుతప్పిననడక- గతుకుల రోడ్డుమీద కాళ్ళు పట్టిపట్టి వేస్తూనడుస్తున్నాడు

అల్లంత దూరంనుండే పాటలు వినిపించాయి.

బాయిదగ్గరి మ్యాన్‌వే (మనుషులుదిగేమార్గం) దగ్గర రేకులషెడ్డుకింద దాదాపు పదిమంది కూర్చుండి బొక్కటోపీలు, చెమ్మాసులు వాయిస్తూ 'సింగరేణికంపెనీలో/ సితుకబడ్డ బతుకులోడ / ఒక్కటయ్యినడుపరో / బరిగీసినిలుపరో/ " అంటూ ఒక సన్నటిపెదిమల కార్మికుడు పాడుతున్నాడు మిగతావాళ్ల కోరస్‌యిస్తున్నారు. టయిమ్ క్లర్కు రూంముందు ముసలికార్మికులు వోర్‌మెన్లు, ఇంజనీర్లు మిగతాఆఫీసర్లు తలో పక్క నిలబడి వాదులాడుతున్నారు. మస్టర్‌క్లర్కు దరువాజలో చేతులుకట్టుకొని నిల బడి చోద్యంచూస్తున్నాడు. ఎడంపక్కగల ఆఫీసునెత్తిమీద మైకు చెవులుగోసిన కుక్కలాగా సమ్మె ఏయేసెక్షన్లపరికారం ఇల్లీగలో దాని పరిణామాలేమిటో చెప్ప తోంది. హాలర్ డ్రైవర్ కుంటివాడు హాలర్ నడిపియ్యాలాపద్దాఅని తేల్చుకోలేకుంటా ఉన్నాడు. ఒక్కమేనేజరు చిరచిరలాడుతూ రావును చూడగానే ఆఫీసు గదికి వెళ్ళి పోయాడు. వోర్‌మెన్‌లు, ఇంజనీర్లు చల్లగా జారుకున్నారు.

కార్మికులు రావు రావడం చూడనట్టుగానే ఊరుపేరు లేకుండా తిడుతున్నారు. ఆడాడ గుడ్డలుపరుచుకొని నడుంవాల్చిన వాళ్ళు ఏదో ఉన్నదని లేచివచ్చారు. ఆ తిట్లు వినుకుంటనే మరికొంత మంది మ్యాన్‌వే ముందటి గోడలకు, క్లర్కురూంకు అంటించిన గోడవార్తాపత్రికలను వెనుకకు చేతులు బెట్టుకొని పెద్దగా చదువుతున్నారు. వాళ్ళపక్క నిలబడిన చదువురాని కార్మికులు "అన్నా మంచిగ రాసిండ్లు గదిగది గట్ల చెప్పరాదు." వ్యాఖ్యానం చేస్తున్నారు.

"అగో లీడరత్తండు- లీడరు. కాసంత ఆగుండ్లెహె॰ ఇగ తమరివంతా బాంచెన్- ఏంచెప్పుతరో చెప్పుండ్లి" అప్పుడే ఆఫీసు చమన్ నీడనుండి లేసొచ్చిన ఉబ్బుచెంపల కార్మికుడు గుడ్డదుమ్ము పోవడానికి దులిస్తూ-

"ఇదివర్దాక ఆఫీసర్లు చెప్పింట్లు ఇగ గీనెచెప్పుతడు లొట్టపీసు" దవడలు చెక్కుకపోయిన కోతిముఖపు ఫిల్లర్.

"ఎవడేంచెప్పిన ఇయ్యేల్ల బాయిలకు దిగేదిలేదు. ఎవడన్న దిగిండంటే ఆడు ఒక్కతండ్రికి బుట్టినట్టే". ఇంకో ఫిల్లర్ ఎట్లాగుదిగపద్దని తెల్లబట్టలేసుకొచ్చినవాడు.

రావు మ్యాన్ వే రేకులషెడ్డుకిందికొచ్చి నిలుచున్నాడు. అప్పటికే ఒళ్ళంత చెమటపట్టింది. ఎండకు ముఖం కమిలిపోయింది.... అక్కడ తన మద్దతుదారులెవ రైనా ఉన్నారేమోనని ఆతురతగాచూశాడు. కాని ఎవడుకనిపించలేదు....

బెల్లంచుట్టు చీమలుమూగినట్టుగా రావుచుట్టూ కార్మికులు మూగారు. పాటలు పాడుతున్నవాళ్లు లేచివచ్చారు.

ఏమిజరుగుతున్నదోనని ఉబ్బాగక ఆఫీసునుండి నిక్కిచూసిన కత్తిమీసాల వోర్ మన్ "ఇగచూస్కో లీడరు దుంపతెంచుతరు". గొణిగినట్టుగాఅన్నాడు.

ఇంకొకడు "మద్దతుగా మీరుపోండ్లిపాపం" కళ్లు పులపొడిచి....

"ఎందుకు దెంగులుపడటాన్కి" కత్తిమీసాల వోర్ మెన్....

రావు చెమటతుడుచుకొని నిటారుగా నిలబడి తనేం ఆందోళన పడటం లేదన్నట్లుగా ముఖంమీద చిరునవ్వు పులుముకొని. చేయెత్తి కార్మికులకేసి సైగచేసి

"కామ్రేడ్స్" అన్నాడు.

"ఓసారూ ! ముందుగాల గిదిచెప్పండ్లి మీరు సిక్సింక్లైన్ బోయివచ్చిండ్లా ? లేదా ?" అన్నాడు ఓఎత్తు టింబర్ మన్.

"కామ్రేడ్ అన్నీచర్చించుకుందాం. మీ పోరాటపటిమచూసి నాకు నిజంగా చాలా సంతోషంకలుగుతుంది. వెనుకట మేం ఉద్యమాన్ని నడిపినరోజులు గుర్తు కొస్తున్నాయి."

"ఓసారు గిదిచెప్పు పోయచ్చిండ్లా ? లేదా ?" టింబరుమన్ అంతెత్తుమీద చెయ్యూపుతూ అడ్డుతగిలాడు.

"కామ్రేడ్ జెరనిదానం. నేను ఎక్కడికిపోలేదు సీదా ఇక్కడికే వచ్చిన."

"అయితే ఇగ నీలెక్చర్లుకానియ్యి. మొన్నటితీర్గ ఆళ్ళను బాయిలదించి ఇటచ్చిండ్లేమోననుకున్న."

"ఔను మన కార్మికుడు అడిగిన సంగతి మంచిదే. ఇక్కడ రెండు సంగతు లున్నయ్. మనం కార్మికులం, మనం వేలటన్నుల బొగ్గు ఉత్పత్తిచేసేటోల్లం కనుక

పనులుచేస్తూ మనకున్న చట్టబద్ధ యూనియన్‌లద్వారా సరైన మార్గంలో అడగాలి. ఇట్లా చీటికిమాటికి సమ్మెలుచేస్తే ఉత్పత్తి దెబ్బతింటుంది అంటే" రావు ఫుంజు కున్నాడు.

"అన్నరుగదా ! ఒరేయి మన తెల్లకమునిస్టు లీడరు చెప్పిన మాటలు విన్నరు గదా! ఇగో మన శంకరయ్య గదే కాంగ్రెసోడు చెప్పిన మాటకు గీయన చెప్పిన మాటకు ఏమన్న తేడా ఉన్నదా ? అని అసలు" హామర్‌మన్.

"నను ననరాదర నువ్వట్లాగు నేనడుగుత దొనయ్యా ఇంతకు బాయిలకు దిగు మనేగదా నువ్వుచెప్పేది ?" నారాయణ అనే హెల్పర్.

"దొనయ్యా ! ఆనాడు బాయిలకు దించిన మాట నిజమే ప్రతి బాయికీ ఏవో చిల్లర మల్లర సమస్యలుంటాయి. అన్నిటిని కలగా పులగంచేసి అన్ని బాయిలు బంధు బెడ్తె ఎట్ల ? దేనికైనా ఓపద్దతుంటది. సమ్మె కార్మికుల ఆయుధం. నేను కాదనడం లేదు. కాని సమ్మెకు ముందు నోటీసివ్వాలి అదిగాక ఎక్కడి సమస్యను అక్కడే సాధ్యమైనంత వరకు పరిష్కరించుకోవాలి. మేం మీతరపున అందుకే ఉన్నంగద" నచ్చచెప్పేధోరణిలో రావు.

"అదీ! సంగతి. బొట్టుబోనం బెట్టిఏర్గబోవాలె. మేం లోపట నీళ్ళసప్లయి లేక పోతే గాలిసప్లయి లేకపోతే నోటిసియ్యాలే. ఎన్నొద్దుల ముందు బాంచెన్. అప్పాల్ రైటు లైన్‌క్లియర్ మీరు సమ్మెచేయచ్చునని దొరలు చెప్పాలె. దుత్తెరి చెప్పేటోనికి లేకున్న ఇంటోనికుండాలె నాలికెల్లబెట్టి సాపుమంటవ్" లాడిసోడు మీదిమీదికొచ్చిండు

ఆ మాటమీదికెల్లి తలోమాట అన్నారు. ఎవరిమాట ఎవరికినిపించలేదు. మందిలనుండి నెత్తులమీద చేతులుబెట్టి ఎత్తుటింబర్‌మెన్ "ఆగుండ్లి.... ఆగుండ్లి...." అని.... అందరు ఆగినతరువాత మందిని జరుపుకొని రావు ముందుకొచ్చి "కోప్పడ కుండ్లి- ప్రపంచ కార్మికులారా ఏకంకండంటరుగదా ? ఏకంచేసుడంటె గిట్లనేనా ? మీదికెల్లి మీది ఎర్రజెండయూనియను- నువ్వు గదాని నాయకునివా ?" అన్నాడు పెద్దగా.

"వ్వారేవ్వా మంచిగడిగినవయా ! నక్కల్లుదగ్గరిపడ్డయి సారుకు" పొట్టో డొకడు టింబరుమన్ సంకలనుండి ఇకిలించాడు.

అందరు నవ్వారు. రావు "ఖామోష్ కామ్రేడ్స్ ఖామోష్ అని చేతులూపాడు. ఎవరు పట్టించుకోలేదు. "పెళపెళ ఎముకలు విరిగేటట్లు" అంటూ వెనుక ఎవరో

పాటందుకున్నాడు.... లీడరుదగ్గరినుండీ చాలామంది దూరంజరిగారు. ఖాతరు చెయ్య కుండా "వానప్పల - గంతదుర్మార్గమా? గంత తలపొగరా?" "కార్మికులు వాళ్లిష్టమచ్చినట్లు అంటె పడుతరనుకుంటండ్లు" "ఒరే! నీతల్లి గోదారిఖనంత గజ గజ లాడిత్తండు అమీన్‌గాడు" ఇట్లా ఎవలమాట వాళ్ళదే....

అందట్లోనుండి చాలాసేపటినుండీ మాట్లాడుదామనుకున్న నడీడు కార్మికుడు లీడరు ముందుకొచ్చి సిగ్గుపడుతున్నట్టుగా బోడగుండు పునుక్కుంట "ఒరే ఆ దొర నెందుకు సతాయించుతరాని వాఎరికల ఇదివరకు టరియికు (సమ్మె)చేత్తె బాయిదొరోడు ఉరికొచ్చెవోడు. గిప్పుడు గీల్లనుదోత్తండ్లు- ఈనె రాంగానే రొయ్యపొట్టుగాడు (మేనేజర్ నిక్‌నేమ్) తోకముడువలేదా? తమరికి ఏపాటిముట్టినయ్ బాంచెన్?" అన్నాడు.

"పదివేలన్నా తీసుకోంది గింతెండలత్తడా?"

"కారేమయ్యింది బాంచెన్?"

"అయితే అయ్యింది. ఇయ్యల్ల మనం బాయిలకు దిగుతే నేనే దింపిచ్చిన్నని పదివేలు దెంగుతడు. ఇయ్యల్ల ఆరునూరైనా దిగేదిలేదు."

"దిగుతే ఇగో మల్లెపూలదండ" పాతబూట్లు తీగకుకుచ్చి కొచ్చిండో కార్మికుడు

అంతవరదనుక ఓతుకు ఓతుకుమని ఏంమాట్లాడకుండా కూర్చున్న టెంపరరీ మజ్దూర్లు మరింక పనిమీద ఆశలువొదులుకున్నారు. బూట్లదండేసుకోవడమంటే తల తీసినట్టే....

"ఇగో గిక్కడగాదు నీ లెచ్చరు. సిక్సింక్లైన్ల సారయ్యను ఎందుకుపనిలనుంచి తీసేసిండ్లో కనుక్కోనిరా? నీకుదమ్ముంటే బేషరతుగా సారయ్యను మళ్ళపనిలకు తీసుకొమ్మను. లేపోతే అచ్చినతొవ్వబట్టు" టింబర్‌మన్ అందరితరఫున చెప్పాడు.

"కామ్రేడ్స్ నేనుచెప్పేది పూర్తిగావినండి" అంటూ రావు రేకులషెడ్డుకింది నుండీ ఎండలనుండి మస్టరు క్లర్కురూందగ్గరి కార్మికులదగ్గరికి మళ్ళీ షెడ్డుకిందికి ఆసుగొట్టమోలె తిరుగుతూ దిగచెమట కారుతుండగా గొంతు బొంగురుపోయేదాకా చెప్పిందే చెప్పిండు- కారల్‌మార్క్సును, ఎంగిల్సును, లెనిన్‌ను మధ్య మధ్య అడ్డం తెచ్చుకున్నాడు. కాని లాభంలేదు.

ఎండ దంచేస్తోంది దాదాపు రెండుగంటలు పదిరి పదిరి రావు నోరెండుక పోయింది. కానికార్మికులు అతనిమాటలు వినిపించుకోలేదు. సమ్మెఆపివేయబడలేదు.

ఇంతలో కార్మికుల్లో నుండి ఒక పొట్టివాడు మందిని జరుపుకొని రావు దగ్గరి కొచ్చి ఎదురుకు చెయ్యడ్డంబెట్టుకొని తేరిపార రావును చూసి పెదవివిరిచి కార్మికుల కేసి తిరిగి "ఛా: ఛా! ఎందుకురా్రి దొరను పరేషాన్ చేస్తరు. నలువబట్టనొంటి మనిషి అలుకుపిడుసై పోయిండు పాపం ముకం ఎట్లమాడిపోయిందో సూడుండ్లి" అని మళ్ళీ రావుకేసి తిరిగి "గింతెండల గీడికెందు కొచ్చిండ్లు బాంచెన్ ఎండెట్ల కొడుతందో సూడుండ్లి! ఈల్లంత చెడిపోయిండ్లుగాదుండ్లి తుక్కను బట్టుకొని గోదారీదినట్టు వీల్లతోనేంది? చందాలకగ్గిదల్ల గింతకష్టపడితే అంత ఇచ్చినచ్చేరా? జీతాలు బడ్డప్పుడు అంగంగి తప్పిచ్చుకపోతరుగాదుండ్లి" అన్నాడు.

రావు ముఖం వికసించింది అంతమందిలో ఒక్కడు కనీసం తనకు సానుభూతి అయినా చూపినందుకు.

"గాలి రానియ్యండ్లిదొరకు గిట్లగాండ్లివొరా ఎండలెందుకు నిలుసున్నరు. జరుగుండ్లెహెఁ- జరుగుండ్లి" అని మందిని జరిపాడు.

రావు మాడిపోయిన చిరునవ్వునవ్వి రేకుల పెట్టె కిందికి నడిచాడు- నడుస్తూ ఆలోచించాడు- చందాలు చూస్తేవసూలవుతున్నాయి. కాని లేబర్లో ఒక్కడు పార్టీ మనిషిలేడు. ఎక్కడోలోపమున్నది. సుల్తాన్ వాళ్ళకు చెప్పాలి. ఆర్గనైజేషన్ ఇట్లా ఉంటే గంగల కలుస్తది. కనీసం బాయికి పదిమందన్నా ఉండాలి. స్ట్రాంగుసపోర్టర్సు ఉండాలి. ఇంతకు ముందు నడిచింది ఇకముందునడువదీ ఒకరిద్దరన్నా ఉండరా? ఉంటే భయపడుతున్నారా? ఇంతమందిలో రాడికల్స్ ఎవలబ్బా!

"ఏందిరో సాకలి సాలయ్య దొరమీద పావురంగారి పోతందేమిరో? కొడుకును గిన పెట్టిస్తనన్నడా?" అన్నాడొకడు

"అదిగాదు మల్లన్న మనమాట మనదేగాని సారుచెప్పిందినుత ఆలోచించాలెమొ? పనిబందుబెడితే" ఎర్రిటియువకుడు గొణిగినట్లుగా అన్నాడు

"ఎవలది జెరంత ఊతలకచ్చి మాట్లాడు తాతకు దగ్గులు నేర్పుతన్నవా? గీనె సంగతి ఎవలకుదెల్వది?" ఇంకొకడు మ్యాన్‌వేగేటు మీదినుండి గయ్యనలేచాడు.

"ఒక్నియువ్వ నన్నొక్క మాటన్నా మాట్లాడనియ్యరయ్యా!" పొట్టివాడు కసురుకొని రావు దగ్గరిదాకా నడిచివినయంగానిలబడి "శరంపాటకం బదులురోజుకో రెండు భర్తీలు (అపాయింటుమెంట్లు) చూసుకుంటె ఎంతలేదన్న ఆరువేలు. ఊకే ఈ చందాల కంట తిరిగేబదులు" అన్నాడు.

రావు ముఖం మాడిపోయింది- నర్సాన కోపమొచ్చింది. "ఎవరిదగ్గర తీసు కున్న- ఏదీ నాముందుకొచ్చి మాట్లాడుమను." అన్నాడు కోపం ఆఖరిపదానికి నీరసంగామారగా.

కార్మికుల్లోనుండి ఒక చుక్కబొట్టు యువకుడు ముందుకొచ్చి "ఇగో నా ముఖంసూడు నేను నాలుగువేలు యియ్యలేదా ?" అన్నాడు బిగ్గరగా....

"మీరంతా చెడిపోయిండ్లు" రావు గొనుగుతూ, తిడుతూ ఎవరో తరుము తున్నట్లుగా వచ్చినదారి పట్టాడు

కార్మికులు ఆ నడకతీరుచూసి ఘొల్లునవ్వారు.

"నవ్వులాటగాదు. నడుపుండ్లి సిక్సింక్లైనోల్ల దగ్గరికిపోదాం- ఎట్లయిలె అట్లయితది ఊరేగింపుతీద్దాం" ఇందాకటి పొట్టివాడు.

"రెండోబజిలీ (షిప్టు) వాళ్ళకు మాయమాటలు చెప్పుతరు ఈడ కొంతమంది ముండాలె" ఒకడు....

పదిమందిని ఏరి కూర్చుండబెట్టారు.

ఊరేగింపు అంటున్నరు. ఊళ్లె వన్‌ఫారిటీఫోర్ సెక్షను బెట్టిండ్లుగదా !" ఎత్తు టింబర్‌మన్....

"ఆఁ వానవ్వ.... సెక్షన్.... ఎవన్నడిగి పెట్టిండురా? లంజకొడుకు పిట్టల గాల్చినట్టు గాలుత్తనని ఎగురుతండట- అమీన్‌గాడు మనలనుసాదిండా ? వానిదేనా రాజ్జెం. బేకారు పనిచేసిండ్లు.... ఏసినోల్లు అక్కన్నే ఏత్తే పీడబాసు. నన్నడుగుతే సూరుమందిని చంపిన లమ్డికొడుకును ఉత్తగిడిసిపెట్టుడు పాపం. అదిగాదయ్యా వానిదుట్టితనానికి జవాబు చెప్పెటోల్లుంటరు. సారయ్యేమన్నడు మద్దెన- కొట్లాడు మన్నడా ? చంపుమన్నడా ? అత్తమీదికోపం దుత్తమీదతీసినట్టు మనసుకచ్చింది చేసుడేనా ? సారయ్యను కొలువులనుంచి తీసేసుడేనా ? ఇయ్యల్లవాన్ని రేపు మనందరిని- మన రొయ్యపొట్టుగాడు (మేనేజరు) సెమ్మాసుబట్టి టబ్బులునింపుతడు. అమీన్‌గాడు హాలరునడుపుతడు. నడుపుకోనియ్యి నీతల్లి.... నడుపుకోనియ్యి-" ఎవడో ఆవేశంగా మాట్లాడుతున్నాడు.

"తుపాకులు బొగ్గుతవ్వలేవు." అన్నాడెవడో బిగ్గరగా

"బొగ్గుతవ్వలేవు" అన్నారు కార్మికులు

ఆఫీసురూంలో కూర్చొండి నాయకునిమీద ఆశలు బెట్టుకున్నమేనేజరు అప్పుడు పోలీస్ స్టేషనుకు ఫోన్ కలిపాడు. ఇంతవరదాకా పోలీసులను రావద్దన్నందుకు విచారించాడు. తాము చేయగలిగిందేమిలేదు కార్మికులు ఏమిచెయ్యకుండా చూడాలి.

కార్మికులు ఆ ఎర్రిఎండలో పిడికిళ్ళు బిగించి సిక్స్‌ంక్లైన్ బాయికేసి నడిచారు. ఎర్రిటిదుమ్ము తెరలుతెరలుగా లేస్తోంది. వాళ్ళముఖాలమీద కప్పుతోంది.

ఫైవింక్లైను కార్మికులు సిక్స్‌ంక్లైను చేరుకునేసరికి అక్కడ గోలగోలగా ఉన్నది.

కుడిపట్రింగా ఎర్రిగాఉన్న బట్టతలమేనేజరు ఏదోఅంటున్నాడు. అతనికి కుడిపక్కన రావు నిలబడి ఏదో నచ్చచెప్పుతున్నాడు. ఎడంపక్క సుల్తాన్ చెమటకు ముద్దముద్దయిపోయి పిల్లిగొంతుపడగా మాట్లాడుతున్నాడు.

నల్లగా బొగ్గుపెళ్ళలాగున్న కార్మికుడు వాళ్లందరికన్నా గట్టిగా "అంతచేసి కూకుండి మీరిప్పుడు తియ్యటిమాటలు మాట్లాడుతండ్లు. మొదట గిదిచెప్పుండ్లి. సారయ్యను ఏకారణంచూపి డిస్‌మిస్ చేసిండ్లు?"

"సారయ్యమీద చాలా కేసులున్నాయి" మేనేజరు.

"చాలాకేసులంటదేందిరో? చాలాఅంటే ఎన్ని వెయ్యా రెండువేలా! నీ భార్యను గుంజిండా?" మందిలోనుంచి

"బాస్టర్డ్స్...." మేనేజరు అరిచాడు.

"మాకొస్తది ఇంగిలిపీసు పోనీ ఆకేసులన్నా రాతపూర్వకంగా ఉన్నాయిగన్క తీసేస్తినని తెలిపినావా?" నల్లటికార్మికుడు.

"ఆఁ కేసులాలేవు లంజెపియ్యాలేవు. సినిమాటాకీసుకాడ అమీన్‌గాన్ని తన్నబోయిండ్లుగదా? పోలీసోల్లు ఊరునిండా దిగిండ్లుగదా! ఇగనాకేంపరువకున్నడు కొడుకు నిన్నరాత్రి పనిబందుబెట్టినమోలె వీడు ఎగిరెగిరి జుట్టుపిట్టతీర్గ పోసుచేసిండు పోలీసులచ్చి సారయ్యను బట్టుకపోయిండ్లు. వీళ్ళకత సూడుండ్లిరా! ఓర్నీయవ్వ మీదికెల్లి ఉట్టుట్టిగనే తీసేసుడు వీళ్ళవంతే. గదేందని అడిగినందుకు అరెస్టుసేసుడు వీళ్ళవంతే" ఒకడు.

"ఇగో గదంత మాకెరుకలేదు సారయ్యను మాతోపాటు బాయిలకు దించుండ్లి ఇగో గిప్పుడేదిగుతం." ఫైవింక్లైన్ కార్మికుడు.

"ఇగో ఈడజేరిండువీడు." అన్నాడొకడు రావును చూయిస్తూ.

"మందిల పిత్తడానికి ఏడికంచె ఆడికితయారు."

వాళ్లట్లా మాట్లాడుతుండగానే డిసిల్ జీబొచ్చింది. వెనుకనుండి రెండువ్యాన్లు వచ్చాయి. జీబులోనుండి ముగ్గురు యస్.ఐ లు సర్కిల్ దిగారు. వెనుకనుండి సారయ్యను దింపారు. వ్యాన్లల్లోనుండి తుపాకులు పట్టుకొని పోలీసులు దిగారు.

సర్కిల్ అట్లా ఉండగానే యస్.ఐ రెడ్డి ముందుకువచ్చి "ఇగోమీ నాయకున్ని తీసుకొచ్చినం మరింక దిగండి" అన్నాడు వ్యంగ్యంగా.

మేనేజరు "హమ్మయ్య" అనుకున్నాడు గోటితోనే పోతేమంచిది ఇది అన్ని పిట్‌లను చుట్టుకుంటే ప్రమాదం మళ్ళీ తనమీదికొస్తుంది ఎట్లాగోఅట్ల పరిష్కారం కావాలి నాయకులను ఏరేస్తే సమస్యలు రావనుకున్నాడు. సందుచూసి వదిలించుకోవా లనుకున్నాడు కాని ఇట్లా కాగలదని ఎవరనుకున్నారు. ఒకవేళ అయినా పోలీసు లున్నారనుకున్నాడు. కార్మికులు చల్లబడ్డారు తట్టలు చెమ్మాసులు వెతుక్కున్నారు. గుడ్డలు సరిచేసుకున్నారు లైట్లు సరిచేసుకున్నారు. మందుగుటకలకోసం మరికొంత మంది మ్యాగ్జిన్‌రూంకేసి పోబోయారు.

"ఇగో మీజోలికిమేంరాం. మాజోలికి మీరు రాకండి ఇట్లా విడిచి పెట్టి అట్లా పట్టుకుంటనంటే మాదారిమేం చూసుకుంటం. బాయిలమీదికి పోలీసులు రావద్దు. పోలీసులొస్తే మేంరాము. మీకు బొగ్గువద్దు తుపాకులే కావాలనుకుంటే మీయిష్టం" అన్నాడో కార్మికుడు.

యస్.ఐలు సర్కిల్ ఆమాటలన్న కార్మికుడెవడా అని మందిలో వెతికారు. అందరిముఖాలు ఒక్కలాగే ఉన్నాయి. మందిలోనిలుచున్న సి.ఐ.డీకి కూడా అన్న వాడెవడో తెలియలేదు.

అందరి ముఖాలు వులుకువులుకున చూస్తూ నిలబడ్డ సారయ్య కొంచెం ముందుకుజరిగి అంగివిప్పాడు "ఇగో అన్నలారా సూడండి. నాపెయ్యిసూడండి నన్ను ఏకారణం చూపకుండానే మేనేజరుగాడు తీసేసిండు. అదేందని అడిగినందుకే కారణం చూయించండి అన్నందుకే వాడు పోలీసులకు ఫోనుచేసిండు- వీళ్లు తీసుక పోయి నాపెయ్యంత బలుగ్గొట్టిండ్లు-" ఉద్వేగంగా చెప్పాడు.

పగిలిన సారయ్య ఒళ్ళును, నల్లగాకమిలిన గాయాలను, కారిగలుసులుగట్టిన నెత్తురును చూశారు ఒక్కొక్కరే చూశారు. కొందరు గొణిగారు మరికొందరు

సారయ్యను తాకి చూడాలనుకున్నారు. మరికొందరు కళ్ళనీళ్లు పెట్టుకున్నారు. అందరి కళ్లు రగులుకునే రాక్షసిబొగ్గు లయ్యాయి. పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"పోలీసుజులుం" ఎవడో గట్టిగా కడుపులపేగులు బయటికొచ్చేంత గట్టిగా అరిచాడు.

"నశించాలి." అంతా మొత్తుకున్నారు.

ఇక నినాదాలు మిన్నుముట్టాయి. బాయిబాయంతా దద్దరిల్లింది. ఆఫీసుక్లర్కులు, ఫోర్‌మెన్‌లు తొక్కిసలాడి బయటకొచ్చారు.

పోలీసులకు పిచ్చెత్తింది. లాఠీలు గాలిలోనికిలేచాయి.

సారయ్యను యస్. ఐ రెడ్డి బూటుకాలితోతన్నుతూ జీబులోనికి తోశాడు. జీబులో ఏదితాకిందో నోట్లో రెండుపళ్లు విరిగాయి. కొంతమంది కార్మికులు సారయ్యడిక్కు పరుగెత్తుకొచ్చారు. లాఠీదెబ్బలు ఫటేల్ ఫటేల్‌మని....

"ఒరే మీరు భూసాముల, పెట్టుబడిదారుల బూట్లునాకే కుక్కలురా! కుక్కలు. మీ దొంగలరాణి కోట్లకుకోట్లు అప్పులుదెచ్చి ఢిల్లీల తైతెక్కలాడుతంది. జీ హజూరు గాళ్ళను పూటకొక్కన్ని మార్చుతంది. దొంగలరాజ్జెంల మీరు విర్రవీగుతండ్లు. కోట్లాదిప్రజానీకం మీకు మీ ప్రభుత్వానికి గోరికడ్తరా! అప్పుడు మీరుతప్పిచ్చుకోలేర్రా.... నేనే...." సారయ్య నెత్తురూరిన నోటితోనే వీరావేశంగా....

యస్. ఐ రెడ్డికి చెమటలుపట్టాయి. పక్కననిలబడి మిగతాఇద్దరు ఏమిచేయ లేక చూస్తున్నారు. రెడ్డిమాత్రం పిచ్చెత్తినట్టు సారయ్యను కొడుతున్నాడు. సారయ్య గర్జిస్తూనేఉన్నాడు.

పోలీసులు కార్మికుల మీదపడ్డారు. కొడుతున్నారు. తన్నుతున్నారు. కార్మికుల్లో కొద్దిమంది చుట్టూ చెల్లాచెదురుగ పరుగెత్తారు. దాదాపు వందమందిదాకా బొగ్గుకుప్ప లాగా చెదరకుండా ఒక్కదగ్గర నిలబడ్డారు. రావు అతని అనుచరులు పోలీసులకు వేలుపెట్టి ఇందాక మాట్లాడిన వాళ్ళందరిని ఏరేరి చూయిస్తున్నారు.

వాళ్ళను పట్టుకుందామని, వాళ్లల్లోకి ఎక్కిద్దామని పోలీసులువాళ్ళదిక్కు కదిలారు.

కాని కార్మికులు అదరలేదు. బెదరలేదు. పిడికిళ్లెత్తి అరిచేవాళ్లు

"పోలీసుజులుం"

"నశించాలి"

"తుపాకులు"

"బొగ్గుతవ్వలేవు"

"జైళ్లు"

"రైళ్ళునడుపలేవు"

నినాదాలు మోగుతూనేఉన్నాయి. అందులో జీరబోయినగొంతుతో టింబర్ మన్ "కామ్రేడ్స్ పారిపోకండి. మాతోరండి"- పిలుస్తూనే ఉన్నాడు.

వందమంది వందాయాభయి.... అక్కడక్కడ చెదిరినవాళ్ళు, దెబ్బలుతాకిన వాళ్లు లగుంవులో వచ్చికలుస్తున్నారు.

అరెస్టుచేయాలని రాబోయిన పోలీసులకు....

"జాగ్రత్త. ఇంతవరదాకా మీరుకొడితే మేంపడ్డాం.... మాకు చేతులున్నాయి. ఇక్కడ మాకు బొగ్గుపెల్లలున్నాయి. మీ అమీన్లు మిమ్మల కాపాడలేరు." ముందు నిలబడ్డ బక్కపలుచటి కార్మికుడు హెచ్చరించాడు.

నెత్తురోడేమట్టి పాదాలు నేలమీదగుద్దుతూ, సుత్తెల్లాగా పిడికిళ్లెత్తి నినదిస్తూ కదులుతూనే ఉన్నారు.

"భయంకరంగా ఉన్నది-" రావు గొణిగిండు కారెక్కుతూ.

"కానివీరోచితంగా ఉన్నది" అన్నాడు సుల్తాన్ ఉద్వేగంగా రావు వెనుక కూర్చున్నసుల్తాన్ ముఖం చూడాలనుకున్నాడు. కాని ఎక్కడినుండో బొగ్గుపెల్ల రివ్వునవచ్చి కార్ టాప్ మీద దఢేల్లునపడ్డది రావు గుండె ఝల్లుమన్నది. కారుస్టార్టు చేసికొని రయ్యునవెళ్ళిపోయాడు. వినాదాలు అరుపులు అతన్నివెన్నంటుతూనేఉన్నాయి.

# అస్సాం

బరాపీ

బ్రహ్మపుత్రి పంటలు పండిస్తుంది
అస్సాం ప్రజాశరీరంలో ప్రవహిస్తున్న
బ్రహ్మపుత్రి తేయాకుతోటలను పండిస్తుంది.

అస్సాం ప్రజలగుండెలు ఆయిల్ రిఫైనరీలు
అస్సాం ప్రజల శరీరాలు వెదురువనాలు
మనస్సులు బ్రహ్మపుత్రి లోయలు
అస్సాం ముడిసరుకు అస్సాంఇంధనం
అస్సాం సరిహద్దు.

అస్సాం సహనానికి హద్దు
అస్సాంలోకి కాందిశీకులు ప్రవేశించడమే కాదు
"విదేశీలు" వరదలైవచ్చి ముంచెత్తుతారు:
అస్సాంలోకి గుత్తపెట్టుబడి ప్రవేశించడమేకాదు,
ప్రవహించడమేకాదు,
అస్సాంను ఆవహించి ఆక్రమిస్తుంది.
ప్రజలమూల్గులను పీల్చి
పంచ లోహాలను రంగరించిన
బ్రహ్మపుత్రి జలాలనూ, మట్టినీ భక్షిస్తుంది
తూర్పు వాకిటి వెలుగైన అస్సాం
దోపిడీ చీకట్లో చిరునామాను కోల్పోయిన అస్సాం
తన పేరేమిటని

చుట్టూవున్న జాతుల్ని చుట్టివేస్తుంది.
తనవునికేమిటని
కేంద్రాన్ని ప్రశ్నిస్తుంది
కానీ పైపులైను పనిచేసే మీటనొక్కే
ఢిల్లీని సూటిగా గురిచూస్తుంది
ఇందిర కాళ్ళు నాకుతూ మచ్చికైన
కవలపిల్లుల్ని పోల్చుకుంటుంది

"తుపాకీగొట్టం ద్వారానే రాజ్యాధికారం వస్తుందని"
కేంద్రానికి అస్సాంలో
సత్యనారాయణసింగ్ హామీ ఇస్తాడు

బ్రహ్మపుత్ర వరదలై పొంగుతుంది
బ్రహ్మపుత్రకు ప్రవహించడమే కాదు
వరదలొచ్చి ముంచెత్తే స్వభావమూవుంది
ఎన్నికలు ప్రకటిస్తే పార్టీల ప్రచారం కాదు
పోలీసు మిలిటరీలు ప్రవహిస్తాయి
చేతికందించింది బ్యాలెట్ పేపరు కాదు
బహిష్కరించిన చేతికీ ఛాతీకీ బుల్లెట్ దెబ్బ
పార్లమెంటరీహింస వరదలై పొంగుతుంది
అస్సాం పీనుగుల పెంట అవుతుంది
ప్రేతాలతీర్పులో ఇందిరా కాంగ్రెస్
అధ్యక్షపాలన నుంచి "ప్రజాస్వామ్య" మార్పుతెస్తుంది
నెత్తురుదాగిన నాల్కలతో మీసాలను తుడుచుకుంటూ
"వామపక్ష ఐక్యతా విజయాలను
బేరీజువేసుకుంటాయి ఎర్రపిల్లులు

అస్సాం ప్రజలనెత్తురును చాయ్‌పత్తిగా అమ్ముకున్న వాళ్ళు
అస్సాంప్రజల చెమటను పెట్రోలుగా అమ్ముకున్న వాళ్ళు
అస్సాం ప్రజల చర్మాన్ని కాగితంగా అమ్ముకున్నవాళ్ళు
బుల్లెట్‌తో బ్యాలెట్ చరిత్ర రాశారు

అస్సాం ప్రజలుకూడ చరిత్ర రాస్తారు.
ఈశాన్య ప్రజల చరిత్రలో భాగంగా
జాతుల చరిత్రలో భాగంగా
ప్రజల చరిత్రలో భాగంగా
అస్సాం ప్రజలు చరిత్రరాస్తారు
ప్రాణ నష్టాలు గడచి

ప్రతిఘటనతో నడచి
ప్రతిహింస చరిత్ర రాస్తారు
జాతుల విముక్తి
ప్రజల విప్లవంలో భాగమని గ్రహిస్తారు
తూర్పు వాకిటి వెలుగైన అస్సాం
మార్పుకు వర్గఘర్షణ అవసరమని తెలుసుకుంటుంది
ప్రజల నెత్తురుగా ప్రవహిస్తున్న బ్రహ్మపుత్ర

ప్రజల సత్తువగా ప్రవహిస్తున్న బ్రహ్మపుత్ర
తోటలనే కాదు
పంటలనే కాదు
ప్రతిహింసా మంటలనూ పండిస్తుంది
బ్రహ్మపుత్ర తూర్పుకు ప్రవహిస్తుంది

---

Statement about ownership and other perticulars about

**SRJANA**

FORM IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication ... ... | Warangal |
| 2. | Periodicity of its publication... | Monthly |
| 3. | Printer's Name ... ... | P. Hemalatha |
| | Whether citizen of India ? ... | Yes |
| | Address ... ... | 3.7-82/4, Kumarpally Hanamkonda 506 001 |
| 4. | Publisher's Name ... ... | P. Hemalatha |
| | Whether citizen of India? ... | Yes |
| | Address ... ... | (same as above) |
| 5. | Editor's Name ... ... | P. Hemalatha |
| | Whether citizen of India? ... | Yes |
| | Address ... ... | (same as above) |

I, P. Hemalatha hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date :
March 1, 1983

*S/d–* **P. Hemalatha**
*Publisher.*

# స్తబ్ధత X చలనం

పాపినేని శివశంకర్

పదే పదే చూస్తున్నాను
ప్రపంచంనిండా పరుచుకున్న డొల్లల్ని
డొల్లలు నవ్వుతాయి డొల్లలేడుస్తాయి
డొల్లలుకదులుతాయి డొల్లలు కంగారుపడతాయి
కాలం కాన్వాసుపై కలల్నిచిత్రిస్తూ గడుపుతాయి
కాగలకార్యాల్ని గంధర్వులకప్పగించి
సంతృప్తిని భోంచేసి సుష్ఠుగా తేనుస్తాయి
సమస్యల చలిజ్వరంతో వణుకుతూ
గాంభీర్యం ముసుగుతన్ని ముణగతీసుకుంటాయి
సౌఖ్యాల పరుగుపందెంలో అడ్డదారులన్వేషిస్తాయి
మెదళ్ళకూ మేధోమాంసాలకూ తుప్పుపట్టి
కీళ్లు కిరకిరలాడుతూ తిరుగుతాయి
వెన్నెముకలో వేరుపురుగులు చేరుతున్నా
వ్యక్తిత్వాన్ని చూసుకు గర్విస్తాయి
ఆర్తీ ఆవేశాలెండిపోయినా
అనుభూతుల్ని కౌయ్యమోహాల కంటించుకుంటాయి
రంగంపై జీవితాన్ని నటించి నటించి
రంగువెలిసిన మొహాలతో నిష్క్రమిస్తాయి
వాస్తవాన్ని అరిగించుకోలేని అజీర్ణవ్యాధితో
బతుకు బతక్కముందే మరణిస్తాయి
డొల్లలకు కళ్లులేవు సులోచనాలు తప్ప
డొల్లలకు కాళ్లులేవు చంకకర్రలు తప్ప
ఎప్పటినుంచో చూస్తున్నానీడొల్లల్ని
ఏడ్వకూ నవ్వకూ తేడాతెలీని డొల్లల్ని
కాలగతిలో గరిమనాభితప్పి వెర్రెత్తి
అలజడితో ఆందోళనతో తిట్టుకుంటూ తన్నుకుంటూ
తెట్టులా కొట్టుకుపోతున్న డొల్లల్ని

* * * *

మున్నతినేపాముల కలలమైకం అబద్ధం
మౌనంపీడని క్రిముల వ్యాపాతపస్సు అబద్ధం

ముడుచుకునే అత్తిపత్తి సంతృప్తి అబద్ధం
వంగినంగి బెదురుగొడ్ల గాంభీర్యం అబద్ధం
దారితప్పిన అడ్డపీతల సౌఖ్యం అబద్ధం
నిలవ నీరు బతుకుల అలలపొంగు అబద్ధం
మాసికలకోటు వ్యక్తిత్వం అబద్ధం
గొడ్డుపోతుమనస్సుల అనుభూతి అబద్ధం
పడిచేనీడల ఉనికి అబద్ధం
కదిలేడొల్లల బతుకు అబద్ధం
అబద్ధం ముసుగుల కపతలి దృశ్యమేమిటి ?
జీవితం ఘర్షణ: జీవితం సాధన

* * * *

ఊసరక్షేత్రాల్ని పదును జేసి
కొత్త ఊపిరులు నాటనివాడు జడుడు-
జడిమ మృత్యువు
అణగార్చే రాక్షసపాదాలకు హారతిపట్టేవాడు భయస్తుడు-
భయం మృత్యువు
కమురుకంపుగొట్టే సమాజంలో
కళ్లతెరిచి కునికేవాడు కదిలేసమాధి-
సమాధి మృత్యువు
శ్మశాన కాష్ఠాలతో చలిమంట వేసుకునేవాడు బద్మాష్
ద్రోహం మృత్యువు
కాంతినిదహించే చీకటికీ కాలంచెక్కిలిపై మసిలే కన్నీటికీ
అర్థం కాననివాడు ఆత్మవంచకుడు-
వంచన మృత్యువు
చెదలుపట్టిన బతుకును మరమ్మతు చేసేవాడు మనిషి
సెప్టిక్ అయిన జీవితానికి శస్త్రచికిత్స చేసేవాడు మనిషి
జీవితాన్ని మార్చేవాడు మనిషి
బతుకును పరిపూర్ణంచేసేవాడు మనిషి-
మనిషి అమరుడు
ఆకలేస్తినవాడికే అన్నం రుచితెలుస్తుంది
పోరాడే మనిషికే జీవితం కసి తెలుస్తుంది
జీవితం చలనం: జీవితం సమరం

# పోరాడోపల్లో

కోరన్న

ఒయి పావల్లాలో రారండీ
పోరాడోపల్లో నడువండి
జొన్నలకూడు చోడీయంబలి తొంబలి తోపయితే ॥తొంబలి॥
ఉప్పు ఒర్రికాయా కసరూ కూరగ ఉడకేసి ॥కూరగ॥
ఉడుకు ఉడుకు సప్పటిగెంజి ఉల్లిపాయిదిన్నాము ॥ఉల్లి॥
ఊడుపులూడ్సిన కాలూ సేతులు ఒరిసీ పుండయితే ॥ఒరిసీ॥
మందూ మాకూ కరువయిపోయీ మంచాన బడ్డామే ॥ఒయి॥
కొడవల్లాకూ కక్కూలేసీ కోతలు కోసాము ॥కోతలు॥
అద్దంలాంటీ కళ్ళంచేసీ కుప్పలు నూర్చాము ॥కుప్పలు॥
గరిసెల ధాన్యం బలిసిన కొడుకులు గాదెల నింపారూ ॥గాదెలు॥
పరిగఏరితే పటపటపట పళ్ళను కొరికారూ ॥పళ్ళను॥
పండినపంటా పందికొక్కులా పాలయిపోతుంటే ॥పాలయి॥
ఖాలీ కడుపుతో మందే పొయిలా భగ్గున మండాలే ॥ఒయి॥

కొబ్బరివణ్ణం కమ్మటి కూరలు మీగడ పెరుగంతా ॥మీగడ॥
మేకగుండెలు కోడిసట్టలా కూకుని మెక్కేసి ॥కూకుని॥
నేతిబూరెలు నూనెగారెలు కమ్మగదింటారూ ॥కమ్మగ॥
పిల్లాపాపా ఆకలిపేగుతొ అల్లాడిపోతుంటే ॥అల్లాడి॥
గుక్కెడిగెంజి పిడికెడు మెతుకులు కబళం అంటే నీ ॥కబళం॥
గుండెలుతీసిన బంటులు మీరని గసురుకు సత్తారే ॥గసురుకు॥
ఎన్నికలొత్తె కాట్లకుక్కలయి ఎగబడుతుంటారు ॥ఎగ॥
నందూ గొందూ సక్కగతిరిగి అమ్మాబాబంటూ ॥అమ్మా॥
వాటంగపిలిసీ ఓటులకోసం గాలంవేసారే ॥గాలం॥
అద్దిరబన్నా మాటలుజెప్పి ఓటులుగుంజారే ॥ఓటులు॥
మాయలమరాఠి మోసంజేసి కొంపలు ముంచారే ॥కొంపలు॥
నక్కజిత్తులా నంబి కొడకులను గోతిలోబెట్టాలే ॥ఒయి॥

మేడలు మిద్దెలు గట్టినవారూ గద్దెలుఎక్కారూ ॥గద్దెలు॥
నాయకులంతా గుండెలమీదా గుదిబండయ్యారూ ॥గుది॥

బూమిని మొత్తం సావగసుట్టి సంకసబెట్టారూ ॥సంకస॥
సంగంబెట్టీ సమ్మెలుజేసి సొంతం అందాము ॥సొంతం॥
దున్నేవానికె దక్కాలి భూమని దండుగవెళ్దామే ॥ఓయి॥

సీకటి బతుకులుసీకూసింతలు తీరాలంటేని ॥తీరా॥
కన్నబిడ్డలకు సక్కని బతుకులు కావాలంటేనీ ॥కావా॥
దిక్కులు నాలుగు పిక్కటిల్లగా పోరేజేద్దాము ॥పోరే॥
రెక్కలు ముక్కలు జేసినవాళ్ళం రాజ్యం ఏల్దాము ॥రాజ్యం॥
ఎగిరేజెండా రాడికల్ దండూ అండవుంటాదీ ॥అండా॥
తుపాకీబట్టిన అన్నలు అక్కలు తోడయివస్తారే ॥ఓయి॥

(“అత్తరుసాయిబోరారా” అనుబాణీలో పాడవలెను)

## రచనల కోసం విజ్ఞప్తి

అమరవీరుడు కామ్రేడ్ బత్తుల వెంకటేశ్వరరావు స్మారక గ్రంథాలయం ఏర్పాటుచేయాలని సంకల్పించాం. ఇది ఒక సాహితీసంస్థ 1-5-1983 న స్మారకసభ జరుపుతున్నాం. ఈ సందర్భంగా కామ్రేడ్ బత్తుల పై ఒక పుస్తకం ప్రచురించదలిచాం. కవులు, కళాకారులు, విప్లవాభిమానులు కామ్రేడ్ బత్తులపై రచనలను పంపించాలని కోరుతున్నాం.

బత్తుల వెంకటేశ్వరరావు, మెమోరియల్ట్రస్టు,
సత్తుపల్లి, ఖమ్మంజిల్లా - 507 303.

మార్చి 23 భగత్‌సింగ్ సంస్మరణ :

# భగత్‌సింగ్ కమ్యూనిస్టు కార్యకలాపాలు

భగ్‌వాన్ జోషి

పంజాబు రైతులపుట్ట. వాళ్ళైనా మోతుబరులేమీకాదు. అప్పుసప్పులతో అడుమానాలతో నానా తిప్పలుపడుతూ నూటికి ఎనభైమంది కనాకష్టంగా బతుకుతూ వచ్చారు. వడ్డీవ్యాపారులు రైతులనడ్డి విరిచేశారు. మతవిభేదాలు ఆరనిచిచ్చుల్లా రాజుకుంటూ, ఇంగ్లీషువాడికి పరోక్షంగా తోడ్పడుతూవచ్చాయి. వాడే వాటిని ఎగసన దోస్తూ వచ్చాడు. బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యవసాయికమైన సుక్షేత్రం ఒకటి అవసరం. పంజాబుపాత్ర అంతే.

ఈ శతాబ్దం ప్రారంభానికి ప్రభుత్వం తవ్వించిన కాలువలమూలాన యాభై లక్షల ఎకరాల ప్రాంతం సాగుబడికి వచ్చింది. భూమిశిస్తువల్లవచ్చే ఆదాయంకంటె సేద్యంనీటివల్ల వచ్చేదే ఎక్కువ. సెంటు పొలమైనా లేనివారి సంఖ్య ఎనిమిదింట ఒకటిగావుండేది. ముప్పయ్యేళ్ళ తర్వాతగూడా నూటికి 83 మంది రైతులకు ఒక్కొక్కరికీ సగటున పదిఎకరాల భూమికిలోపే. కౌలుదార్ల కాయకష్టమే ఖామందుల భోగభాగ్యాలకుమూలం. ముస్లిములు పాలికాపుల్లో అధికసంఖ్యాకులు. కొద్దిపాటి భూస్థితిగల రైతాంగం ఎంతో పొదుపుగా మొరటుగా ఉన్నంతలోసరిపెట్టుకుంటూ సొంతకాళ్లమీద నిలబడగలిగేవాళ్లు. బ్రిటిష్ సైన్యయంత్రానికి ఈ కుటుంబాల కుర్రకారే తమరక్తాన్ని కందెనగా సమకూర్చి నడిపేవాళ్లు. దేశానికి ఖడ్గహస్తంగా పంజాబు పేరుపొందింది. గాజభక్తికి మారుపేరైంది. పింఛనుపుచ్చుకున్న మాజీ సైనికులు ఆందోళనకు దిగకుండా కాలువనీటి పారుదలప్రాంతంలో కొంతభాగాన్ని వీరికి కేటాయించడం జరిగింది. 1906 లో సాగిన రైతాంగం అల్లర్లవెనక యీ పింఛనీదార్లహస్తం వున్నదనే అనుమానమే యీ కేటాయింపు చట్టానికి దారితీసింది (1907). అప్పటికి పదేళ్ళక్రితమే యిలాంటిచట్టాల్లో మొదటిది అమల్లోకివచ్చింది. మొదటి ప్రపంచయుద్ధంలో శిక్కులరక్తం దేశాంతరాలలో చాలాఖర్చయింది. సన్నకారు రైతాంగవర్గం యువత చాలాప్రాణత్యాగంచేసింది. తిరిగివచ్చినవారికి బిరుదులూ, బహుమానాలూ భూములూ శిస్తుమాఫీలు లాభించాయి. తెల్లదొర- 'గోరాసాహెబ్'- దయామయుడనిపించాడు. భావదాస్యం పల్లెపట్లకు విస్తరించింది.

రాజకీయంకూడా గ్రామసీమలకు వ్యాపించింది. వ్యవసాయం ముఖ్యవృత్తి గాని హిందూకులాలవారు సేద్యపుభూములు కొనరాదనే నిషేధాన్ని 1900 నాటి చట్టం

ప్రవేశపెట్టింది. ఈ కులాల్లో ముఖ్యమైనవి ఖత్రీ, అరోరా, బనియా వగైరా. ఇవి అసంతృప్తి చెందాయిగాని ధనిక ముస్లిములుమాత్రం పూరా సంతృప్తి ప్రకటించారు. ఈచట్టాన్ని వీలుచేసుకుని రైతు తనపొలాన్ని పాతరుణదాతనుంచి విడిపించుకోగలిగాడుగాని కొత్తరుణదాతలు వేరేకులానికి చెందినవాళ్లుగాక, కాస్త వెనకేసుకున్నడబ్బు పూర్చుజూచిన వ్యవసాయదారులే. వాళ్లూ, వీళ్లూ, వ్యవసాయాన్ని ఆశ్రయించిన యావన్మందీ ప్రపంచ ఆర్థికమాంద్యం వాతబడక తప్పలేదు. పంట ధరలు పడిపోయాయి. కూనాకురుణా సర్వనాశనమైంది. భూమిశిస్తుకట్టలేక నగా నట్రా తెగనమ్మవలసివచ్చింది. సేద్యంనీటికీ తీర్వారేటు తగ్గించమంటూ ఒత్తిడిపెరిగింది. బేదఖళ్లను బంద్‌చేయించమని పేదరైతాంగం, కౌలుదారీవర్గం ఘోషించింది. రుణాలమాఫీజరగాలంది. కౌలురేట్లుతగ్గాలంది. వాతావరణం కుపింపసాగిందన్న మాట.

'కష్టజీవి'కి 'కిర్తి' అని పంజాబీపేరు. ఈపేరుతో 1926 నుంచీ ఒకపత్రిక రాసాగింది. దీని స్థాపకులు గదర్‌పార్టీనాయకులు. రష్యన్ విప్లవప్రభావంవల్ల సంపూర్ణ స్వాతంత్ర్యన్నేగాక సోషలిజాన్నీ ఈ పత్రిక ప్రబోధించింది. సోషలిజం అనాటికింకా అస్పష్టంగావుండిన కొత్తభావమే. నిర్మాణంగురించి ఎవరూపట్టించుకోలేదు. అప్పట్లో మూడోఇంటర్నేషనల్ ప్రచారకార్యకలాపాలు యం.యన్. రాయ్ రహస్యదూతలద్వారానూ పత్రికలద్వారానూ పంజాబులోకి చొచ్చుకొస్తుండేవి. తూర్పుదేశాల ప్రజాసదస్సు బకూనగరంలో 1920లోనే జరిగివుంది. సోవియట్ విప్లవం వలసదేశాల పీడితప్రజాకోటిని కదిలించబూనిందిగాని బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని బోల్షివిజం 'ప్రమాదం'నుంచి కాపాడేందుకు చర్యలుతీసుకోవడం మొదలైంది. సిక్కు గురుద్వారాల మహంత్‌లకు వ్యతిరేకంగా లేచిన అకాలీ ఉద్యమానికి భూస్వాములూ బస్తీల ధనికసిక్కులూ నాయకులనే వాస్తవాన్ని గమనించకుండా, యం. యన్. రాయ్ దాన్ని అతిశయోక్తులతో అబ్ధీకరించి దానికిలేని స్థిరమైన అభ్యుదయ జాతీయపోరాటస్వభావం ఉన్నట్లుగా చిత్రిస్తూవచ్చాడు. శ్రామిక వర్గసైన్యానికి పంజాబు 'రిక్రూటింగ్ గ్రౌండ్'గా పనికిరాగలదని రాయ్ ఆశ. 1922 నాటికే గులాంహుస్సేన్ నాయకుడిగా పంజాబులో ఒక కమ్యూనిస్టుబృందం ఏర్పడింది. పెషావర్‌లో బడిపంతులుగావుంటూ కాబూల్‌వెళ్లి కమ్యూనిస్టుగా మారి వచ్చిన గులాంహుసేన్ లాహోర్‌లో 'ఇంకిలాబ్' పత్రికను స్థాపించాడు. జాఫర్ హుసేన్, ఖుషీమొహమ్మద్, ఇక్బాల్‌షిరాయ్ వగైరాలతో సంబంధాలు పెట్టు

కున్నాడు. రాయ్ స్థాపించిన కమ్యూనిస్టుపార్టీఆఫ్ఇండియా కు ఖుషీమొహమ్మద్ అధ్యక్షుడు, గులాంహుస్సేన్, షౌకత్ కార్యదర్శులు, ఇక్బాల్‌షిదాయ్ ఒక ముఖ్య కార్యకర్త. షౌకత్ ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో లాలాలజపత్‌రాయ్‌తో, చమన్ లాల్‌తో పరిచయంసంపాదించాడు. 'ఇంకిలాబ్' పత్రికలో రాయ్ వ్యాసాలు మారు పేర్లతో తర్జుమాఅవుతూ వచ్చేవి.

కాన్పూర్ కుట్రకేసులో గులాం హుస్సేన్ అరెస్టయ్యాడు. దయాభిక్ష అర్థిస్తూ పిటిషన్ పెట్టుకుని తన రహస్య కార్యకలాపాల గురించి పూసగుచ్చినట్లు వర్ణించి, షౌకత్ లాంటి తనమిత్రులకూ వ్యతిరేకంగా సాక్ష్యంచెప్పేందుకుకూడా సిద్ధ మయ్యాడు. ఈలోపల 'ఇంకిలాబ్' ఆగిపోయింది. కమ్యూనిస్టు కార్యకలాపాలకు చాలాపెద్దదెబ్బతగిలింది. ఈలోగా 1923 మే 1న సింగారవేలుచెట్టి స్థాపించిన 'లేబర్ కిసాన్ పార్టీ ఆఫ్ హిందూస్థాన్'కు సభ్యులను చేర్పించే కార్యక్రమం వచ్చింది. కాన్పూర్‌లో 1925లో జరిగిన కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా స్థాపనలో పాల్గొన్న పంజాబ్ విప్లవకారుడు అబ్దుల్ మజీద్ కార్యవర్గసభ్యుడు కాగలిగాడు. అప్పటికే మోటాసింగ్‌లాంటివాళ్ల కమ్యునిస్టుభావాలను బుజాలవేసుకుని తమకుతోచిన రీతిలో పంజాబు గ్రామసీమకు వినిపించుతూ వచ్చారు. టెర్రరిజం తమపంథా కాదంటూ, కాంగ్రెస్ కార్యక్రమాన్ని మార్చడంద్వారానే స్వరాజ్యం సాధించగలమని ప్రచారంచేశారు. సహాయ నిరాకరణోద్యమంవంటి అహింసాయుత పోరాటపంథా పట్ల వారికి గురిలేదు. లజపత్‌రాయ్ ప్రభృతుల అరెస్టులతో 1921లో కాంగ్రెసు కార్యక్రమాలు పంజాబీల కంటికెక్కాయి. గ్రామగ్రామాన సత్యాగ్రహులు ఖైదు శిక్షలకు సిద్ధమయ్యారు. అకాలీ ఆందోళన ఖిలాఫత్ ఉద్యమంతో స్ఫూర్తిగలిపింది. పంజాబ్ జాతీయోద్యమంలో అడుగెట్టింది.

ఎన్నడో 1907లో బ్రిటిష్ రాజ్యనిర్మూలనగురించి ఉపన్యాసాలతో సంచల నం కలిగించిన అజిత్‌సింగ్ ప్రధానంగా రైతాంగఉద్యమ నాయకుడు. ఆ తర్వాత చెప్పుకోగలిగిన సంచలనం గదర్‌పార్టీది, ఇంకా ఇటీవల అకాలీపోరాటానిది. మోటాసింగ్ ప్రచారం కమ్యూనిజం భావఉత్తేజం కలిగించింది. 'ఇంకిలాబ్' బృందం సిద్ధాంతవిరమణకు పూనుకొంది. లాహోర్ కుట్రకేసులు జనాన్నికదిపాయి. కాన్పూరుకుట్రకేసు కమ్యూనిస్టుపార్టీ నిర్మాణాన్ని తాత్కాలికంగా ఛిన్నాభిన్నం చేసింది. సింగారవేలుచెట్టి ప్రయత్నాలు 'కిర్తి కిసాన్‌పార్టీ' అవతరణకు దోహదం చేశాయి. ఈ బృందానికి 'సామ్రాజ్యవాద వ్యతిరేకసమాఖ్య'తో, యం. యన్.

రావ్‌తో లంకెకలిసింది. గదర్ పార్టీబృందాలు 'దేశ్ సేవక్', 'అఖిల్-ఎ-పర్దేశ్', 'దిపంజాబు' వగైరా పత్రికలు ప్రకటించసాగాయి. 'కీర్తి' ఒక్కటే కమ్యూనిస్టు భావాల వాణి. 1926 నుంచి అది వెలువడుతూ వచ్చింది. ముఖపత్రంమీద ఒక అమరవీరుడి శరీరం చిత్రం పక్కన పుష్పదాయం చిత్రం వుండేది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాల్గవ సమావేశానికి అమెరికానుంచి వెళ్లి హాజరైన సంతోక్‌సింగ్ ఇండో-చైనా దేశాలలోని భారతీయులలో విప్లవప్రచారంచేస్తూ, శాన్‌ఫ్రాన్సిస్కో-కుట్రకేసులో 21 మాసాల జైలుశిక్షననుభవించి విడుదలతర్వాత గదర్ ఆశ్రమం స్థాపించినవ్యక్తి. రష్యాలో కోమింటర్న్ అధినేత జినోవియేవ్‌ను కలిసి మాట్లాడి వచ్చాడు. బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ సలహా సంప్రదింపులతోనూ సహాయంతోనూ యీదేశంలో కమ్యూనిస్టుపార్టీని పటిష్ఠంచేయబూనాడు. 1923లో తిరిగివచ్చి, ప్రభుత్వం ఆజ్ఞలమేరకు రెండేళ్ళపాటు స్వగ్రామంలోనేవుండి, 1925లో అమృత్‌సర్‌కు వెళ్ళి గదర్‌పార్టీ సహచరులైన భాగ్‌సింగ్ కెనెడియన్, కరమ్‌సింగ్ చీమాలతో కలిసి 'కీర్తి' పత్రిక స్థాపించాడు. కాన్పూర్‌లోజరిగిన కమ్యూనిస్టు ట్రేడ్ యూనియన్ సమావేశంలో పాల్గొన్నాడు కూడా.

'కీర్తి' పత్రిక శాస్త్రీయసోషలిజాన్ని పనిగట్టుకు ప్రచారంచేసింది. శ్రామిక వర్గ అంతర్జాతీయతను నొక్కిచెప్పింది. వలసదేశాల స్వాతంత్ర్య పోరాటాలను సమన్వయం చెయ్యాలంది. కార్మికవర్గ విప్లవప్రాముఖ్యాన్ని వివరించింది. సంతోక్‌సింగ్ మరణించాకనే పంజాబీ రైతాంగసమస్యలగురించి 'కీర్తి' పత్రిక పట్టించుకోవడం మొదలైంది. ఇప్పుడు 'కీర్తి'కి 'కిసాన్'అనే మాటతోడైంది. ఇందులో వడ్రంగులూ లోహకారులూ రైతులూ చర్మకారులూ నేతగాళ్లూ, యిలా వివిధ వృత్తుల కష్టజీవులగురించి అవగాహన కలిగింది. పైగా సంతోక్‌సింగ్‌లాంటి మాజీ గదర్ విప్లవకారులు మార్క్సిజాన్ని ఆమోదించినా, సిక్కుమత సాంప్రదాయం నుంచి బైటపడలేదు. 'కేపిటల్'ను చదివినా, అనాదికాలపు కొయ్యనాగలి మనస్తత్వం వదల్లేదు. ఆధునికమైన పెట్టుబడిదారీ, కార్మికవర్గాలగురించి సవ్యమైన అవగాహన ఏర్పడలేదు. 'కీర్తి కిసాన్‌పార్టీ' యీవిషయంలో ఆధునికతకు నాంది.

సైమన్ కమీషన్ పర్యటన దేశాన్ని ఈ కొసనుంచి ఆకొసకు కుదిపేసింది. జలియన్ వాలాబాగ్ సంస్మరణోత్సవం 1928 ఏప్రిల్‌లో దీనికి మరింత వూపిచ్చింది అమృత్‌సర్‌లో ఆస్థలంలో జవాహర్లాల్‌నెహ్రూ అధ్యక్షతన పంజాబురాష్ట్ర రాజకీయ మహాసభ జరిగినప్పుడు యువకులే ఎక్కువగా పాల్గొన్నారు. బ్రిటిష్ సామ్రాజ్యం

లోపల గాకుండా దానితో సంబంధమేదీ లేకుండా భారతదేశం పూర్ణస్వరాజ్ సాధించు కోవాలనే లక్ష్యాన్నీ, శాంతియుతమైన, చట్టబద్ధమైన పద్ధతుల ద్వారా అని గాకుండా వీలైన అన్ని పద్ధతులద్వారా అనేదాన్ని కాంగ్రెసు లక్ష్యప్రకటనను మార్పు చేర్పులు చెయ్యాలని ఈ మహాసభ తీర్మానించింది. సోషలిస్టు విప్లవకారుడవిపించుకున్న నెహూ్రు అధ్యక్షోపన్యాసం పంజాబీ జమీందార్లకు గంగవెర్రులెత్తించింది. మధ్య యుగతత్వాన్నీ ఆర్థిక అసమానతనీ తొలగించాలని కోరాడు మరి ! ఈ మహాసభతో బాటు యువజన మహాసభ ఒకటి జరిగింది. జాతీయవాదభావాలున్న యువకులను కేంద్రీకృతమైన ఒక రాష్ట్రీయ సంస్థలో సమీకరించడమే దీనిలక్ష్యం. 'కిర్తి' నిర్వా హకులకు కలిగిన భావమిది. ఈ మహాసభ మరికొన్ని రోజులతర్వాత జరుగు తుందనగా ఒక యువకుడువచ్చి 'కిర్తి' ఆఫీసులో సోహన్‌సింగ్‌జోష్‌ను కలిశాడు. తానూ తనమిత్రులూ అప్పటికే నౌజవాన్ భారత్‌సభ అనే యువజన సంస్థను నిర్వా హిస్తున్నట్టూ, కొన్ని కారణాలవల్ల అది యిటీవల నిస్తబ్ధంగా ఉన్నట్టూ చెప్పాడు. అయినా తాము యిప్పుడు జరగబోయే యువజన మహాసభలో పాల్గొంటామని మాట యిచ్చాడు. అతనెవరోకాదు భగత్‌సింగ్.

ఈ మహాసభలో ఒక విషయం మీద తర్జనభర్జనలు జరిగాయి. గోపాల్‌సింగ్ క్వామీ మున్షీ అహ్మద్‌దీన్ లాంటి వాళ్ళు మత సంస్థలకూ మతవర్గాలసంస్థలకూ చెందిన యువకులు కూడా యీ కొత్తసంస్థలోపాల్గోవచ్చునని వాదించారు. 'కిర్తి' బృందమూ భగత్‌సింగ్ బృందమూ యీ వాదాన్ని వ్యతిరేకించారు. పూర్ణస్వరాజ్‌కోసం సోష లిజంకోసం యువకులు సంఘటితంకావాలని యీ మహాసభ మొత్తంమీద నిర్ణయించింది.

భగత్‌సింగ్ స్థాపించి నిర్వహిస్తూవచ్చిన నౌజవాన్ భారత్‌సభకు లాహోర్ కేంద్రస్థానం. ఆ నగరంలోని కళాశాలల విద్యార్థులకే ఎక్కువగా అది పరిమితమై వుండేది. 1926 మార్చి నుంచి 1927 ఏప్రిల్ దాకా ముమ్మరంగా పనిచేసింది. నైతిక, సాహిత్య, సామాజిక విషయాల మీద చర్చలుసాగిస్తూ, స్వదేశీ వస్తువుల వాడకం ప్రచారంచేస్తూ, భారతీయ భాషల్లో నాగరికతలో ఆసక్తిని కలిగిస్తూ వచ్చిన ఈ సంస్థకు రామ్‌చంద్రు అధ్యక్షుడు. భగత్ కార్యదర్శి, భగవతీచరణ్ వోహ్రా కోశాధికారి. యం. ఎ. మజీద్, కేదార్‌నాథ్‌సెహగల్ సభ్యుల్లో కొందరు. స్వరాజ్యం అంతరార్థం గురించి యస్. ఏ. డాంగే, ఫిలిప్‌స్ప్రాట్ వంటి కమ్యూ నిస్టులు కొన్ని సభల్లో ప్రసంగించి వున్నారు. అయినా తాత్కాలికంగా అది మూల

బడింది. ఇప్పుడు 1928 ఏప్రిల్ నాటికి 'కీర్తి' బృందం, లాహోర్ కమ్యూనిస్టులు సమకూర్చిన ప్రోత్సాహం ఫలితంగా రెక్కలొచ్చింది. సరికొత్తగా రూపొందించిన లక్ష్యప్రకటనలో యావత్ భారతదేశపు శ్రామికులకూ రైతులకూ చెందిన సంపూర్ణ స్వతంత్ర రిపబ్లిక్ స్థాపన, సమైక్య భారతజాతి నిర్మాణానికి యువకుల హృదయాలలో దేశాభిమాన భావప్రేరణ, ఆర్థిక, పారిశ్రామిక, సామాజిక ఉద్యమాలపట్ల సానుభూతి సహాయాలు, మతవర్గభావాల నిరసన, కార్మికుల రైతులసమీకరణ సంఘటన ముఖ్యాంశాలు. నౌజవాన్ భారత్‌సభ సంస్కరణ వాదాన్నీ జాతినిర్మాణం వగైరా అస్పష్టధోరణుల్నీ విడనాడిందన్నమాట. అబ్దుల్‌మజీద్, సోహన్‌సింగ్ జోష్, కేదార్‌నాథ్ సెహగల్ రాష్ట్రంలోనూ రాష్ట్రాంతరాలలోనూ అనేక సమావేశాలు నిర్వహించి యీ సంస్థకు శాఖలు నెలకొల్పారు. రైతుకూలీ సంఘాల నిర్మాణమూ సాగిపోయింది. కాంగ్రెసు, ఖిలాఫత్ కమిటీల సభ్యులుకూడా నౌజవాన్ భారత్‌సభలో చేరారు. ఈ మూడు పెనవేసుకున్నట్లయింది. 1929లో సోహన్‌సింగ్ జోష్ అధ్యక్షుడు, యం. పి. మజీద్ ఉపాధ్యక్షుడు, హరిసింగ్ చాక్వాలియా కార్యదర్శి అయ్యారంటే 'కీర్తి' బృందానిదే పైచెయ్యి అయిందనవచ్చు.

సోషలిజానికి అనుకూలంగా రష్యన్‌విప్లవాన్ని బలపరుస్తూ పెట్టుబడిదారీ విధానాన్నీ సామ్రాజ్యవిధానాన్నీ ఖండిస్తూ వ్యక్తిగతంగా నౌజవాన్‌భారత్‌సభ సభ్యులు బహుముఖంగా కార్యకలాపాలు విస్తరింపజేసుకున్నారు. "రష్యామిత్రులు" వారాన్ని నిర్వహించేందుకు సభలుపెట్టారు. అమృత్‌సర్‌లోని కార్మికసంఘాలలో దూరసాగారు. బొమ్మ లాంతరు ప్రదర్శనలద్వారా విప్లవభావాలను ప్రచారంచేశారు. 'సిద్ధాంత గ్రంథ సమాజం' నెలకొల్పి బోల్షివిక్ కమ్యూనిస్టు సిద్ధాంతంవెలుగులో భారత జాతీయ సమస్యలగురించి ప్రకటించిన పుస్తకాలలో పేర్కొనదగినవి లాలా హర్దయాల్ రాసిన 'జాతులసంపద', ఆగ్నెస్ స్మెడ్లీరచన 'భారతదేశమూ రానున్న యుద్ధమూ', ఛబిల్‌దాస్ రచన 'భారత్‌మాతాకాదర్శన్', 'యువజనులకు నాలుగు మాటలు' వగైరా యుద్ధవ్యతిరేకతతోబాటు, మతవర్గ తత్వఖండన ప్రముఖాంశంగా వుండేవి.

కమ్యూనిస్టు నాయకులుగా రూపొందనుండిన సోహన్‌సింగ్ జోష్‌లాంటివారి మీదనే సిక్కు మతతత్వప్రభావం వుండేదంటే భగత్సింగ్‌లాంటి యువకులగురించి చెప్పనవసరంలేదు. 'ప్రాణత్యాగి' (మార్టియర్) భావానికి ఆ మతంలో ప్రముఖ స్థానంవుందని సిక్కు మతగురువుల జీవితచరిత్రలే చాటుతున్నాయి. మందగించిన

జనం చైతన్యాన్ని రగుల్కొల్పి ప్రోత్తేజపరిచేందుకు కొందరు మహనీయులు ఆత్మ త్యాగం చేసుకోకతప్పదు. అలాంటిత్యాగిని జోష్ 'కీర్తి' వ్యాసంలో మిన్నుల కెత్తాడు. త్యాగికి ప్రజాసామాన్యంకంటె ఉన్నతభావాలుంటాయి. శనకాలాన్ని మీరేట్టుగా స్వతంత్ర, సమున్నతభావాలతో, ఇతరులకు గుప్తమైన సత్యాన్ని తాను కనుగొని ప్రచారంచేస్తూ, లోకనిందకూ ఖండనకూ వెలికీ గురౌతాడు. నవ్వుల పాలౌతాడు. ఉన్మాది అనిపించుకుంటాడు. ఉలిపికట్టెగా భావించే జనం గతానుగతి కంగానే వుంటూ సంప్రదాయాన్ని పాటిస్తూ అభివృద్ధిని అడ్డుకొంటూ వుంటుంది. త్యాగి యీ నిందా తిరస్కారాలను లెక్కచెయ్యడు. ధిక్కరిస్తాడు. వ్యవస్థాపిత పద్ధతులను నిరసిస్తూ ఉల్లంఘిస్తాడు. మౌఢ్యంలో కూరుకున్న జనాన్నిచూచి జాలి గొంటాడు. వారి నిద్రావస్థను అంతమొందించాలంటే తాను ఆత్మబలిదానం చెయ్యక తప్పదనుకుంటాడు. ప్రాణత్యాగంజరిగాక జనంకలవరపడి ఆలోచించసాగుతుంది. కళ్లు తెరిపినపడి, త్యాగివిశిష్టతను గుర్తిస్తుంది. త్యాగిగురించిన యిలాంటి భావ పరంపర చెగ్రిజాన్ని అనుకూలించింది.

నౌజవాన్ భారత్‌సభ పునర్నిర్మాణమయ్యాక దానిలో రెండు ముఖ్యధోరణులు బైటపడ్డాయి. జాతీయోద్యమం నత్తనడకతో అసంతృప్తి చెందిన భగత్సింగ్ లాంటి వారు ఏదో ఘనకార్యం చేసిచూపాలని తహతహలాడసాగారు. రష్యన్ అనార్కిస్టులైన క్రొపోట్కిన్, బకూనిన్‌ల భావాల ఆకర్షణలో పడ్డారు 'యాక్షన్ జనాన్ని మేల్కొలిపి, ఉద్యమానికి బలమిస్తుంది' అనే దృక్పథం చేబట్టారు. రాజ్యాంగయంత్రం సమాజ నిర్మాణంలో అంతర్భాగం కాకుండా, కేవలం నిర్బంధ సాధనంగా వుంటూంది గనక దాన్ని బద్ధలుగొట్టాలనుకున్నారు. ఇది వీరోచితంగా జరగాలి. గదర్ వీరుల ప్రేరణ వుండనేవుంది. బకూనిన్, క్రొపోట్కిన్‌ల భావాలను పేర్కొంటూ 'అనార్కిజం చరిత్ర' అనే వ్యాసమొకటి 'కీర్తి'లో భగత్సింగ్ 1928 జూలైలో ప్రకటించాడు. కమ్యూనిజం గురించి త్వరలో మరోవ్యాసం రాస్తానన్నాడు. కాని. ఘటనలు మరో విధంగా జరగడంమూలాన ఇది నెరవేరలేదు. వెయ్యికరపత్రాల మూలంగా జరిగే ప్రచారానికంటె ఒక్క సాహసకార్యం అతికొద్దికాలంలోనే జరిగే ప్రచారం ఎక్కువ అనేది భగత్సింగ్ ప్రధానభావం. అప్పట్లో తాము కటికనిశ్శబ్దాన్ని చెదరగొడుతూ నిర్దిష్టస్థలాలలో సమయోచితంగా ప్రభుత్వోద్యోగులలో అత్యంతద్వేషపాత్రులైన వారిమీద సమ్మెటపోట్లలాంటి దెబ్బలుతీస్తే కట్లలు తెంచుకుని ప్రజావుద్యమ మొక్కటి పునాదితో మొదలౌతుందనీ, దాని సాయుధదళంగా పనిచేస్తూ తాము దానికి సోషలిస్టు

తెన్నును చూపెట్టగలమనీ భావిస్తూ వచ్చినట్లుగా తదనంతరకాలంలో అజయ్‌ఘోష్ రాశాడు. ఫ్రెంచి ప్రభుత్వాన్ని హడలెత్తిద్దామనుకుని శాసనసభలో బాంబు వెయ్యబోనుకున్న వాలియంట్ 'చెవిటివారు వినాలంటే మేఘగంభీరస్వరం కావాలి' అన్న మాటను పేర్కొన్నాడు. సోహన్‌సింగ్ జోషికిగూడా అప్పటికింకా రాజకీయసిద్ధాంత పరిజ్ఞానం అంతంతగానే వుండేది. టెర్రరిజానికీ మార్క్సిజానికీ మధ్యగల భేదాన్ని చూడలేకపోయాడు. కాబట్టి భగత్సింగ్ వాదాన్ని తిప్పికొట్టలేకపోయానని తానే ఒప్పుకున్నాడు. అయినా భగత్సింగుకూడా చివరికంటా తనవాదాన్ని పిడివాదంగా కొనసాగించలేదు. జైల్లో అతనికి భావపరివర్తన కలిసింది. మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలను క్రమబద్ధంగా అధ్యయనం చేసిన ఫలితంగా ఆత్మపరిశీలన చేసుకున్నాడు. ఉరికంబ మెక్కేనాటికి భగత్సింగ్ సృజనాత్మక మార్క్సిస్టు భావుకుడూ సిద్ధాంతవేత్తా కాగలిగాడనవచ్చు. తమ కార్యక్రమం ఏదో ఒకనాడు నిష్ఫలమైపోతుందేమోనన్న అనుమానంతోగూడిన భయం అతని జీవితాన్ని మలుపుతిప్పింది. హృదయాంతరాళంలో 'అధ్యయనం' అనేమాట మారుమోగింది. బలప్రయోగపద్ధతుల ఆకర్షణ స్థానే సీరియస్ భావాలపట్టు ఏర్పడింది. వాస్తవవాదానిదే పైచెయ్యి అయింది. ఆదర్శాలకు సంబంధించి కూడా బకూనిన్, మార్క్సు, లెనిన్, ట్రాట్స్కీల గ్రంథాలను చదివినందువల్ల ప్రపంచవిప్లవ లక్ష్యం బలవత్తరం కాగలిగింది.

నౌజవాన్ భారత్‌సభ పుట్టిందిమొదలు పంజాబు రాష్ట్రప్రభుత్వం దానిమీద ఒకకన్నువేసేవుంచింది. సైమన్‌కమీషన్ వ్యతిరేకఆందోళనలో అది అగ్రభాగాన నిలిచి లాహోర్‌లో పేలిపట్టు సంపాదించుకుంది. అమృత్‌సర్‌లోగూడా బలంగా వుండింది. జనంలో దానిపలుకుబడి పెరగసాగింది. వలసాధిపత్యం కన్నెర్ర జేసింది. దానికార్యకర్తలు ముగ్గురిని అరెస్టుచేసింది. ఈ సంఘాన్ని నిర్మూలించి వేసే తరుణంకోసం వేచిచూడసాగింది.. 1928 డిసెంబర్ 17న శాండర్స్‌వధతో యీ అవకాశం కలిగింది. ఉద్రేకపూరితంగా వుపన్యసించినవారిలో ముఖ్యులమీద వెంటనే కేసులు బనాయించవలసిందిగా కేంద్రప్రభుత్వంనుంచి 1928 డిసెంబర్ 20న రాష్ట్రప్రభుత్వానికి తాఖీదువచ్చింది. శాండర్స్‌వధతో సంబంధంవుందనుకున్న వారిలో పందొమ్మండుగురిని అరెస్టుచేశారు. దమనకాండ మరీదారుణంఅయింది. జనంలో వెల్లువికిన ఉత్సాహం త్వరగానే చల్లబడింది. భ్రమలు వైదొలగి నిరాశ వ్యాపించింది. శాండర్స్‌వధ తర్వాతనే టెర్రరిజంపట్ల 'కీర్తి' బృందం వైఖరి మారింది. ప్రజానంఘనిర్మాణం, జనసమీకరణం ముఖ్యమనే జ్ఞానం ఉదయించింది.

ఎవరో కొద్దిమందిని చంపినంతమాత్రాన వ్యవస్థ మారదు గనక సామూహిక శాసన ఉల్లంఘనకూ పన్నులనిరాకరణ పోరాటానికి పూనుకునేలా ప్రజలను సంఘటిత పరచడమే తమపంథా అంటూ సోహన్‌సింగ్ జోష్ కాకోరీకేసు మృతవీరుల దినం (1928 డిసెంబర్) నాడు జరిగిన బహిరంగసభలో వివరించాడు.

పంజాబు రాష్ట్ర నౌజవాన్ భారత్‌సభ రెండోసమావేశం లాహోరులో 1929 ఫిబ్రవరి 22 నుంచి 24 దాకా జరిగింది. జోష్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. సభాకార్యక్రమంలో బ్రిటిష్ వ్యతిరేకత, సోషలిస్టు అనుకూలత ప్రస్ఫుటంగా ధ్వనించాయి. అధీన (డొమినియన్) రాజ్యప్రతిపత్తితో తృప్తిపడబూనిన కాంగ్రెసు రాజకీయలక్ష్యాన్ని తీవ్రంగా విమర్శించారు. ఆ సంవత్సరమే ఆగస్టు 9, 10 తారీఖుల్లో మూడవ సమావేశం జరిగింది. 3 వేలమంది నుంచి 6 వేలమంది దాకా ప్రతినిధులు హాజరయ్యారు. జవాహర్‌లాల్ నెహ్రూ వచ్చాడు. కిర్తి-కిసాన్ పార్టీ సభ్యులూ స్వరాష్ట్రానికి మరలివచ్చిన అతివాదులనేకులూ పాల్గొన్నారు. భగత్‌సింగ్ బటుకేశ్వర్‌దత్‌ల త్యాగాలను నెహ్రూ ప్రశంసించాడు. కాంగ్రెసుతో పోలిస్తే సభ తన స్థానాన్ని మరింత పటిష్ఠం చేసుకోగలిగింది. అధ్యక్షోపన్యాసంలో జోష్ తాము వ్యక్తిహింసావాదాన్ని నిర్ద్వంద్వంగా నిరాకరిస్తూ, "విప్లవకరమైన ప్రజాకార్యాచరణ"లో తమకు గల నమ్మకాన్ని వుద్ఘాటించి చెప్పాడు. ఇది మార్క్సిస్టు అవగాహనకు అనుగుణంగానేవుంది. "వ్యక్తిహింస ప్రజలపాత్రను వారి చైతన్యపరంగానే తక్కువచేస్తుంది. తమ శక్తిహీనత సరిపెట్టుకోనిస్తుంది. ఒకానొక మహత్తర కార్యసాధనకోసం అవతరించనున్న విముక్తిదాత గురించీ పూర్వావమానాలకన్నిటికీ పగతీర్చుకునే మహావీరుడి గురించీ ప్రజలు ఎదురుతెన్ను చూసేలా చేస్తుంది. టెర్రరిస్టు కార్యకలాపాలు ఫలమయ్యేకొద్దీ, వాటి ప్రభావం పెరిగేకొద్దీ, ప్రజల శ్రద్ధాభక్తులు వాటిమీదనే నిలుస్తాయిగాని తమ స్వవిద్య, స్వసంఘటనపట్ల ఆసక్తిని తగ్గించివేస్తాయి," అని ట్రాట్‌స్కీ రాసింది పంజాబ్ కమ్యూనిస్టుల తలకెక్కడానికి యింత కాలం పట్టింది.

మీరట్ కుట్రకేసు సందర్భంలో సోహన్‌సింగ్ జోష్, అబ్దుల్‌మజీద్, కేదార్‌నాథ్ సెహగల్ అరెస్టయ్యారు. ఇది 1929 మార్చి మాసంలో జరిగింది. కాని, మే మాసంలో నౌజవాన్ భారత్‌సభ తనచేవను మరోమారు చూపెట్టింది. అన్ని జిల్లాలలోనూ 'భగత్‌సింగ్ - దత్‌దినం' జరిపారు. లాహోర్‌సభలో 'వందేమాతరం'

నినాదం బదులుగా 'ఇంకిలాబ్ జిందాబాద్' నినాదం, 'సామ్రాజ్యవాదం నశించాలి' నినాదం వినిపించాయి. లాహోర్‌లోనూ అమృత్‌సర్‌లోనూ 144 సెక్షన్ విధించారు. లాహోర్ కుట్రకేసు రక్షణ నిధివసూళ్ళకోసం తీసిన ఊరేగింపులను చెల్లాచెదురు చేశారు. సత్యపాల్ మోటాసింగ్ వంటినాయకులను మూసేశారు. క్రమంగా కిర్తి-కిసాన్ పార్టీ కార్యకలాపాలు విస్తరించసాగాయి. అంతర్జాతీయంగా సామ్రాజ్యవాద వ్యతిరేక సమితితో సంబంధాలు, దేశంలో కాంగ్రెసుతో సత్ సంబంధాలు పెరిగాయి. జాతీయోద్యమంలో యీ పార్టీ యిప్పుడు అంతర్భాగమైంది. రైతాంగ ఉద్యమం తలెత్తింది. ఆ కథ వేరే.

(సేకరణ : కె. వి. ఆర్)

---

## పుస్తకస్వీకారం

1. సృష్టికర్తలు (కథల సంపుటి) - అల్లం రాజయ్య; యుగ ప్రచురణలు, హైదరాబాదు; పేజీలు : 104, వెల: 5 రూ.లు: ప్రతులకు : 1. పీస్‌బుక్ సెంటర్, హైదరాబాదు; 2. సృజన, హనుమకొండ, వరంగల్ - 506 001

2. చర్య (కవితా సంకలనం) - సాగర్; పేజీలు : 40, వెల : 2 రూ.లు; ప్రతులకు: 1. పీస్‌బుక్ సెంటర్, 4-5-421, సుల్తాన్‌బజార్ హైదరాబాదు-1 2. సృజన, హనుమకొండ - 506 001

3. వజ్రసంకల్పం (వచన కవితా సంకలనం) - సంకలన కర్తలు: వెంపలి వెంకటశివప్రసాద్, పెమ్మరాజు గోపాలకృష్ణ; పేజీలు : xii + 34; వెల : 3 రూ.లు; ప్రతులకు : 1. వెంపలి వెంకటశివప్రసాద్, బోయనవారివీధి, అనకాపల్లి - 531 001 2. వి. వి. రమణమూర్తి, విజ్జూరి జోగినాయుడుగారి వీధి, అనకాపల్లి - 531 001

4. కవితాసౌరభం (కవితల సంపుటి) - కాలువ మల్లయ్య; ప్రచురణ: జనహిత సాహిత్యసమితి, కరీంనగర్; పేజీలు : 82; వెల: 4 రూ.లు; ప్రతులకు : 1. కాలువ మల్లయ్య, బి-64, ఫెర్టిలైజర్ సిటీ, కరీంనగర్ - 505 210; 2. ఎస్. కె. పిళ్లే, జనహిత సాహిత్యసమితి కన్వీనర్, 7-4-45/1, కాశ్మీర్ గడ్డ, కరీంనగర్ - 505 002

---

## రంగులవల - మరోకోణం

"స్వప్నాలమ్మకం మా వృత్తి." - మైక్ టాడ్

"ప్రజలకవసరమైనదానికీ, ప్రజలు కోరేదానికీ, సమన్వయమే నా సినిమా"

— శాంతారామ్

(ఇక్కడ ప్రజలు అంటే ప్రేక్షకులు కూడా)

"సినిమా శక్తివంతమైన ఆయుధం" —లెనిన్

స్థూలంగా సినిమాను గురించి అవగాహనకు రావడానికి ఈ పై వాక్యాలు పనికొస్తాయి.

అయితే- సినిమా కళగా, వ్యాపారంగా, ఎత్తిన, ఎత్తుతున్న అవతారాలన్నింటికీ సామాజిక ఆర్థిక సూత్రాలు Background గా వుంటాయి. తెలుగు సినిమాకు సంబంధించి మరో ప్రత్యేకతవుంది. తెలుగు సినిమా మన నాటకరంగం కన్నబిడ్డే. మన వీధినాటకాల్లోనూ, స్టేజినాటకాల్లోనూ సల్లక్షణాలూ, దుర్లక్షణాలూ తెలుగు సినిమాకు సంక్రమించిన వారసత్వం.

అయితే- ఒక కళాప్రక్రియగా సినిమాస్థల. కాలపరిమితులను జయించగలదు. ఈ శక్తిని, మన వారసత్వాన్ని సమన్వయపరచగలిగిన ఉన్నతశ్రేణి తెలుగు సినిమా ఇంతవరకు రాలేదు.

పారలల్ సినిమా, ప్రయోగాత్మకసినిమా, సమస్యాత్మక సినిమా, వ్యాపారేతరసినిమా అని పేర్లుపెట్టడం శాస్త్రీయం కాదు. తెలుగు సినిమాలోనూ, ప్రపంచ సినిమాలోనూ కూడా సమాంతరంగా వ్యాపారసినిమా, అందుకు భిన్నమైన సినిమా వృద్ధిచెందుతూనేవచ్చాయి.

అమెరికన్ సినిమా శైశవావస్థలో వుండగానే గ్రిఫిత్, ఎరిక్వాన్ స్ట్రోహీం లాంటివారు అత్యున్నత ప్రమాణాల్లో వాస్తవిక చిత్రాలు తీశారు. ఈ ధోరణి బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాలలో కూడా చూడవచ్చు.

దేవాలయాల్లో విగ్రహాల్నుంచీ, దిక్కుమొక్కులేని ఆడపిల్లల వరకూ అన్నిటినీ, అందరినీ అమ్మి లాభాలుచేసుకోవడం ఈ పారిశ్రామిక యుగపులక్షణాలు. కనుక సాంకేతిక శాస్త్రానికీ అనేక తరాలుగా కళలుగా ఎంచబడ్డ నృత్యం, సంగీతం, శిల్పం, నాటకం వగైరాలకు జన్మించిన సినిమాను కేవలం వ్యాపారంగా చూసే మనుష్యులు, సంస్థలుండడం అద్భుతమూకాదు. అబద్ధమూకాదు.

అందుకనే ప్రజలు 'కోరుతున్న' సినిమాలను తీసేవాళ్ళే ఎక్కువ. 1950కి ముందు తెలుగు సినిమా కేవలం మధ్యతరగతి వారికే అందుబాటులో వుండే వినోద సాధనం. బహుశ ఇది భారతీయ చిత్రాలన్నిటికీ వర్తిస్తుంది. (అమెరికాలో తొలి సినిమాలు అంతగాపనిలేని ఉద్యోగాలకోసం, పనులకోసం తహతహలాడుతున్న సామాన్యజనులకు ఉద్దేశించినవి)

అందుచేతనే 1950 ముందుకొచ్చిన పౌరాణికాలను, జానపదచిత్రాలను పది లేస్తే సాంఘిక చిత్రాలన్నిటా సామాజిక చైతన్యం చాలా బలమైన అంశంగా కనబడు తుండేవి. అప్పుడున్న సామాజిక వైరుధ్య రాజకీయ వైరుధ్యమే అంటే సామ్రాజ్య వాదులకు, భారతీయులకు మధ్యనున్న వైరుధ్యమే స్వాతంత్రోద్యమానికి అందు తోడ్పడే ఇతర అంశాలకు అనుగుణమైన చిత్రాలే 1950కి పూర్వం ఎక్కువ కనబడు తుండేవి. ఆ చిత్రాల్లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులను సూటిగా విమర్శించివుండక పోవచ్చు. 1947కు ముందున్న ఆదర్శాలే 1950 వరకూ కొనసాగాయి. 1946 నుంచి 50 వరకు ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో కొనసాగిన నిర్బంధకాండ, ప్రజాపోరాటాలు మన రాజకీయరంగంలో చాలా ముఖ్యమైన ఘట్టం.

కమ్యూనిస్టుపార్టీ తెలంగాణా పోరాటం 'విరమించిన' తర్వాత, కొంచెం అంతకు ముందుగానూ కూడా- ప్రజానాట్యమండలి నుంచీ, అభ్యుదయ రచయితల సంఘం నుంచీ, ఇతర ప్రజాఉద్యమాల నుంచీ అనేకమంది సినిమారంగానికి వలస పోయారు. కొందరైతే పారిపోయారు.

డా॥ రాజారావు 'పుట్టిల్లు'తోనూ, మరో ట్రూపు 'పల్లెటూరు'తోనూ సినిమా రంగప్రవేశం చేశారు. భావతీవ్రత, సాంకేతికనైపుణ్య స్థాయి బలహీనంగా వుండ డంవల్ల 'పుట్టిల్లు' ఫెయిలైంది. 'పల్లెటూరు' నుంచీ 'మనుషులు మారాలి' వరకూ మన అభ్యుదయవాదులు తీసిన సినిమాలన్నీ 'వివేకభ్రష్ట సంపాతములే'.

దీనికి కారణం రాజకీయాల్లో రివిజనిజం. జీవితంలో ప్రతిచోటా 'రాజీ' పెట్టుబడిదారుతో 'రాజీ', సుఖాలతో 'రాజీ', విజయాల్తో 'రాజీ', తెలుగు సినిమాకు ఆమాటకొస్తే భారతీయ సినిమాకు మళ్ళీ చైతన్యం 'నక్సల్బరీ'కి కొంచెం ముందో లేక వెనుకో.

ఐతే, ఒకటి మాత్రం స్పష్టంగా చెప్పుకోవాలి. స్వాతంత్ర్యానికి పూర్వం బూర్జువావర్గం సినిమా తీసినా ఇతరులు సినిమా తీసినా స్పష్టంగా దేశస్వాతంత్ర్యం

ప్రధాన ఆదర్శమైవుండేది. స్వాతంత్ర్యానంతరం పెట్టుబడిదారీవర్గానికి, కార్మిక వర్గానికి ప్రయోజనాల్లోనూ, లక్ష్యాల్లోనూ సహజమైన అంతరం ఏర్పడింది. పెట్టుబడి దారీవర్గం తన లక్ష్యాన్ని, ఆదర్శాన్ని, ప్రయోజనాన్ని క్షణంకూడా మరిచిపోకుండా వివిధ ప్రచారసాధనాలను తనకనుకూలంగా ఉపయోగించుకున్నది.

అదేరకంగా కార్మికవర్గ ఆదర్శాలను, లక్ష్యాలను ప్రజానాట్యమండలి ద్వారా సినిమారంగంలో ప్రవేశించిన అభ్యుదయవాదులు నెరవేరుస్తారని ఆశించారు. ఆ ఆశ ఎంతోకాలం నిలువలేదు. బూర్జువావర్గానికి శ్రామికశక్తినమ్ముకొని వెన్నెముకలేని కళాకారులుగానే మిగిలిపోయారు. ఈ బలహీనతా, దిగజారుడుతనం ఏదోకొందరు వ్యక్తులకుమాత్రమే పరిమితమైలేదు. ఇది నిస్సంశయంగా రివిజనిజానికి అను బంధంగా జరిగిందే. కాని, చిత్రమేమిటంటే ఇలా దిగజారిపోయిన కళాకారులు కొందరు తాము ఎప్పుడో, ఏనాడో ఎర్రజెండా పట్టుకుతిరిగిన పాపఫలితంగా సినిమారంగంలో ఇబ్బందులు పడుతున్నామని అప్పుడప్పుడు పత్రికా ప్రకటనలు చేస్తుంటారు. ఎందుకనంటే వాళ్ల పాపం లక్షాధికారులుమాత్రమే అయ్యారు. కోటీశ్వరులుకాలేదు. వాస్తవం ఇందుకుభిన్నం. వాళ్లెప్పుడో ఎర్రజెండాపట్టుకొన్న పుణ్యానికే అవకాశాలు- కొందరికి తొలిఅవకాశాలు, మరికొందరికి క్లిష్టపరిస్థితుల్లో అవకాశాలు- వచ్చాయి. ఇప్పటికీ ఎర్రజెండాపేరుతో ప్రజాఉద్యమాలపేరుతో ప్రజా కళలపేరుతో సినిమారంగంలో కాలుపెట్టడానికీ, పాతుకుపోవడానికీ ప్రయత్నాలు చేస్తునేవున్నారు.

సినిమారంగంలో ప్రవేశించే చైతన్యవంతులు రెండు విషయాలు గమనించాలి. గత చరిత్రను చిత్రీకరించేటప్పుడు నిర్మాతలకు దర్శకులకు ఒకమోస్తరుస్వేచ్ఛ వెసులుబాటు వుంటాయి. సమకాలిక జీవితాన్ని ఆర్థిక, రాజకీయ పునాదులతోసహా చిత్రించాలనుకుంటే స్వేచ్ఛ కుంచించుకపోతుంది. నిర్మాతలలక్ష్యం బూర్జువావర్గ ప్రయోజనాలకు ఎంత భిన్నమైతే అంతమేరకు ఆంక్షలు తిరుగుతాయి. ఈ అడ్డంకిని అధిగమించాలంటే శ్రామికవర్గ సామాజిక అవగాహన చలనచిత్రకళపై అధికారం సాధించినపుడే సాధ్యం. నిజానికీ నూటికి నూరుపాళ్లు విప్లవ సినిమా ప్రస్తుత వ్యవస్థలో సాధ్యంకాదు. ఇది గమనిస్తే విప్లవాభిమానులైన కళాకారుల మార్గంస్పష్టం.

— వివేక్

సమీక్ష :

# రుక్మిణీనాథశాస్త్రి కథలు

సామాజిక జీవితంలో మధ్యతరగతి పైకిరావడంతోటి సాంస్కృతిక జీవితం కూడా మారాకుతొడుగుతుందని చెప్పనక్కర్లేదు. విలువలు మారుతాయి. దృక్పథమూ మారుతుంది. ఈమార్పు సాహిత్యంలో మరీ స్ఫుటంగా కనిపిస్తుంది. వచనం ప్రముఖమౌతుంది. వ్యావహారిక శైలిదే పైచేయి అవుతుంది. కథలూ నవలలూ ముందుకొస్తాయి. కావ్యచరణాలుకూడా నిత్యసంభాషణ తాలూకు వాక్యనిర్మాణాన్ని అరువుతెచ్చుకుంటాయి. కళ శిఖరాలనుంచి మైదానాలకు దిగివస్తుంది. దాని సాంఘిక పునాది వెనకటికంటె విశాలమవుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ప్రజాస్వామిక భావ వాతావరణం వ్యాపిస్తుంది.

తెలుగుకథకు నిజంగా ఆధునికరూపాన్నీ స్వభావాన్నీ ఇచ్చింది గురజాడే. ఆచంటి సాంఖ్యాయన శర్మకాదు. అయితే గురజాడ చనిపోయిన తర్వాత(1915) దాదాపుగా రెండుదశాబ్దాలదాకా తెలుగుసాహిత్యమంటే భావకవిత్వమే ననిపించేంతగా కాల్పనికవాదం నిండిన కావ్యరచనలే విరివిగా వచ్చాయి. చలం ప్రభంజనం మొదలయ్యేంతవరకుగూడా తెలుగులో వచన సాహిత్యానికి నిజమైన వూపురాలేదు. "శిష్ట" వ్యావహారికాన్ని వదిలి "గ్రామ్యాన్ని" చేపట్టకపోయినా, చలం కథనశైలి కొండవాగుకంటె పురవడిగా పొంగి, కృతకత్వాన్ని దరిజేరనీయకుండా, భావోద్రేక నిర్భరంగా సాగింది. గురజాడ కవితల్లో కథల్లో నాటకాల్లో ఎత్తిచూపిన స్త్రీ-పురుష సమస్య చలంచేతిలో ఏకైకవిషయంగా మారింది. స్థిమితమూ విశ్లేషణా లోపించి మహావేశంతోగూడిన సంరంభం అతిశయించింది. మళ్లీ ఈ దూకుడునుంచి తప్పుకుని సాఫీగానడిచేందుకు, సంసారాలూ సంపాద్యాలు వగైరాల చుట్టూతిరిగే మధ్యతరగతి కథకు కొంతకాలంపట్టింది. పెళ్లి, పడకటిల్లూ, పండగలూపబ్బాలూ, సరసాలూ సర్దాలూ, వైధవ్యాలూ కష్టాలూ, తీరేదైనాలేని ఆశయాలూ. ఇలాంటి వాటితోకూడిన సాదా మధ్యతరగతి జీవితం కథకులకు ప్రధానమైన ఇతివృత్తాన్ని ఇచ్చింది. కవులై, "పండితులై"కూడా మంచికథలు రాసినవాళ్లు ఎందరోఉన్నారు. వాళ్ళలో జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ఒకరు. 'శరత్ పూర్ణిమ' పేరుతో వచ్చిన ఆయన కథల తేదీలుచూస్తే 1934 మొదలు 1946 దాకా రాసినవని తెలుస్తుంది.

తెలుగు సాహిత్యంలో 'అభ్యుదయ' ధోరణి ప్రవేశించక ముందునుంచీ, వాస్తవికతావాదంతోగూడిన రచనలు ఉంటూనేవచ్చాయి. మధ్యతరగతి ప్రాముఖ్యం

తోటి ముడిబడిందే ఈ విశేషం కూడా. ప్రాబంధికతమీద ఇది తిరుగుబాటే. హేతుబద్ధమైన ఆలోచనాసరళి ఇందులో భాగమే. మతవిశ్వాసాలుసడలి శాస్త్రవిజ్ఞాన విషయాల పట్ల గురి ఏర్పడింది. వీరేశలింగం, గురజాడ వంటి వైతాళిక రచయితలు పెట్టిన పరుపడి గట్టిపడేలోపల హైందవ పునరుద్ధరణోద్యమ ప్రభావంవల్ల మళ్ళీ మన సాహిత్యం వెనకపట్టుపట్టింది. విశ్వనాథ సత్యనారాయణవంటి గొప్ప రచయితల ద్వారా అది కొనసాగుతూనే పోయింది. కాల్పనికత అనబడే రొమాంటిసిజమ్‌లో కూడా ఒక చెంపనేమో స్త్రీ-పురుష సంబంధాలమీద భూస్వామిక సమాజం విధించిన నిర్బంధాలకూ పరిమితులకూ వ్యతిరేకంగా ధిక్కారవైఖరితో వ్యక్తిస్వేచ్ఛను కోరుతూ 'భావ'కవిత్వం ముందుచూపుతో వెలువడినా, మరొక చెంపన మాత్రం గతాన్నిశిరోవి తలకెత్తుకునే తత్వంతో 'నియోక్లాసిసిస్ట్' కవిత్వం ఒదిగివుండింది. ఈ విషయంలో కవిత్వానిది మొత్తంగానే వెనకడుగు. వచనంలో వాస్తవికతావాదానిదే పైచేయి. కాల్పనికావేశంతో రాసినా చలం బూర్జువా వ్యక్తివాదాన్ని అరాచకం స్థాయిచేరు కునేంతగా ఆశ్రయించాడు. కుటుంబరావు వంటి రచయితలతో వాస్తవికతావాదమూ హేతుబద్ధమైన ఆలోచనాసరళీ విజ్ఞానశాస్త్రానుకూలమైన వైఖరీ మళ్ళీ ప్రాణంపోసు కున్నాయి. ఆ కాలానికి చెందిన రుక్మిణీనాథశాస్త్రి వంటి రచయితలందరూ అంతే చైతన్యంతోటి అంతే నిలకడగా రాశారని అనుకోగూడదు. వ్యక్తి జీవితాన్ని బట్టి మాత్రమేగాక సామాజిక ప్రభావాలనుబట్టికూడా వారి వచనరచనలలో పరస్పరవిరుద్ధ మైన అంశాలు కనిపిస్తాయి. ఉదాత్తమైన ప్రయోజనదృష్టికూడా అంతబలంగా ఉన్నట్టనిపించదు. కాకుంటే, సమాజగతిని వెనక్కుమళ్లించేవికావు గనక ఈ రచన లను నిరాదరించవలసిన అగత్యంలేదు. అలాచెయ్యడం అనుచితం.

'నాలో నేను' అనేది ఈ సంపుటంలో పొరబాటున దూరింది. రవీంద్రనాథ్ టాగూరు మరణవార్త విని రుక్మిణీనాథశాస్త్రి రాసిన వ్యాసం ఇది. పోగా 19 కథ లున్నాయి. 'అగ్ర'వర్ణాల పరిధిలోనే ఈ కథలు సంచరించడానికి, కథకుడికి సుపరి చితమైన జీవితపార్శ్వం అదొక్కటి కావడమే కారణమనుకోవాలి. వర్ణం విషయం అటుంచి, ఈ కథాపాత్రలు ఎక్కువగా మధ్యతరగతి కిందిపాయాకు చెందినవిగా ఉండటానికి ఇదే కారణమనిపిస్తుంది. వాస్తవికతావాదం అపేక్షించేది కూడా ఇదే. అయితే ఒకటి రెండు కథలలో తప్ప తక్కినవాటిలో జీవితానికి సంబంధించిన స్వల్ప విషయాలు ఇతివృత్తాలై, 'చమత్కారానికో తేలిపోయే హాస్యానికో' అంకితం కావ డానికి రుక్మిణీనాథశాస్త్రి వ్యక్తిత్వ విశేషమే కారణం కావచ్చు. భార్యాభర్తల సరాగా

లను మొత్తంగా తీసివెయ్యడం, కుర్రవాళ్ళ స్త్రీవ్యామోహాన్ని కొట్టివెయ్యడం, బతుకులో దొర్లే చిన్నచిన్న పొరబాట్లను ఎత్తివెయ్యడం, ఇలాంటి పనులు మంచివి కావనుకుంటే తప్ప, పెంకిపిల్ల, సన్మానప్రయత్నం, సూట్‌కేస్ వంటి కథలను పేరెన్నికజెయ్యడం అనవసరం. అయితే మొత్తం సంపుటానికి ప్రాణకళనిచ్చే కథలు నాలుగైదేఉన్నా, ఆ సంపుటం అవశ్యం మంచిదే.

ఏదో ఒక వ్యసనానికిదాసుడై పిత్రార్జితాస్తంతా కరారావుడు చుట్టేస్తూ చివరికి భార్యఒంటిమీది నగలను కరిగించేంతదాకా వచ్చిన భర్తనైతే రామసీత చాలాకాలం సహించింది. పైగా తమది మేనరికం. అయితే తనశీలాన్నే శంకించేసరికి, అలా శంకించిన మనిషి భర్తే కావచ్చుగాని పరమనీచుడుగనక, చేసేదీలేక ఓర్చుకోనూలేక, ఇలాంటి సంసారానికి 'ఒక్కదణ్ణం' అనుకుంటుంది. ఆకథ శీర్షికాఇదే. ఇందులో గాంధీ రాజకీయోద్యమాలుమొదలు నాటకోత్సాహాలదాకా ఆ దశాబ్దంలో పల్లెటూళ్లదాకా దిగివచ్చిన ఆకర్షణలు అనేకం ప్రస్తావనకు వస్తాయి. నిరుద్యోగం ప్రబలిన డిప్రెషను రోజుల్లో విద్యావంతులైన తెలుగుయువకులు మద్రాసులాంటి నగరాల్లో పొట్టకోసం పడినపాట్లగురించి విషాదాన్నీ, హాస్యాన్నీ రంగరించి చూపే మంచి కథ 'యాచన'. చిన్నతనంలోనే విధవరాలై వంటగత్తెగా తాను బతుకుతూ కన్నబిడ్డను ప్రయోజకుణ్ణి చేయాలనుకుని ఎలాగో చదువుచెప్పించబూనుకున్న తల్లి, చదవాలనే కోరికబలంగావున్నా పేదరికంవల్ల తోటి బడిపిల్లల హేళనకుగురై చదువుకోగూడదని నిర్ణయించుకున్న బిడ్డ- వీళ్ళగురించి జాలికలిగేలా రాసిన కథ 'నేను ఫోన్లే'. వీటన్నిటినీ మించిన కథ 'హోమగుండం'. బాలవితంతువయ్యాక ఎందరెందరికో లొంగి చివరకు శరణాలయంచేరి ప్రసవించినవెంటనే బిడ్డను పోగొట్టుకున్న నరసమ్మను ప్రేమతోగాక, కేవలం తన ఇంటిపనికోసమని, పెళ్ళాడిన సూళ్ళేస్కూలు టీచరు హను మంతరావు పరమకర్కశంగా చూస్తూ రాక్షసంగా ప్రవర్తించడంలో; మానవత్వం చావని నరసమ్మ తెగించి నిప్పంటించుకుని కాలి చనిపోతుంది,- సంస్కరణాలేదు, చట్టుబండలూలేవు. శరణాలయాలు మనుషుల మార్పిడీసంస్థలుగానే మిగిలాయి. చేరినవాళ్ళను ఏదోవిధంగా వదిలించుకోవడమే వాటిపని. వీరేశలింగం రోజుల్లో ఆయనే జరిపించిన వితంతు పునర్వివాహాల విషయంలో కూడా ఒక విమర్శ ఉండేది; వితంతువులను పెళ్ళాడుతామని ముందుకు వచ్చిన యువకులు కొందరు సంస్కరణ మీద గురివుండి గాకుండా, పెళ్ళాడినందుకూ కుటుంబపోషణకూ ముట్టగల డబ్బుమీది గురితోనే ఆ పనికి పూనుకునేవాళ్లు. పరమ అయోగ్యులూ భ్రష్టులూ కూడా వీరిలో

కొందరుండేవాళ్లు. వీరేశలింగం పరులగుణాలన్నీ యోగ్యతలనీ పట్టించుకునేవాడు కాదని, 'తోట'కు వచ్చిన బాలవితంతువులను ఎవరో ఒక అయ్యచేతిలో పెట్టడంగురించే శ్రద్ధచూపేవాడని విమర్శలు సాగాయి. తన జీవితకథలో చలమే ఇలాంటి విమర్శ చేసివున్నాడు. "హోమగుండం" కథలో నాయకవ్యక్తి హనుమంతరావు ఇలాంటి నికృష్టుడే. బిడ్డ నిచ్చిన కొంతకాలానికి భార్యగతించాక, శరణాలయం నుంచి వచ్చి బాలెంతరాలైన నరసమ్మను కేవలం దాసీభావంతో తెచ్చుకుని పెళ్ళిజరిగిందనిపించి. ఆ తర్వాత అనుమానాలపుట్టగామారి, పూర్ణయవ్వనంలో నిష్కల్మషత్వంలో వున్న ఒక మనిషిని మనిషిగా చూడక, చివరికి ఆత్మహత్యచేసుకునేందాకా అవమానిస్తాడు. ఇది మంచి కథ అంటే చాలదు.

వెనకటి తరానికి చెందిన రచయితలు పూర్తిగామరుగై మరుపున పడిపోకుండా వారి రచనలను సేకరించి మొదటిసారిగా గ్రంథరూపంఇస్తున్న 'నవోదయ' పబ్లిషర్సును అభినందించక తప్పదు. వట్టి వికటకవి, కేవలం వినోదప్రియుడు, తెనాలి రామలింగని తాజా అవతారంఅని జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి గురించి చాలా మందికి ఒక అపోహ ఉంది. ఈ సంపుటం దాన్ని తొలగిస్తుంది. రుక్మిణీనాథశాస్త్రి చలం యుగంమీదుగా అభ్యుదయ సాహిత్యంలోకి వచ్చాడు. అ.ర.సం. రాజమండ్రి మహాసభ (1945)లో సంస్థకు సంయుక్త కార్యదర్శిగా ఎన్నికయ్యాడు కూడా. చాలా కాలం కమ్యూనిస్టు ఉద్యమాన్ని అభిమానించాడు. అలాంటివ్యక్తి హాస్యానికి గూడా 'సీరియస్ పర్పస్' తప్పకవుంటుంది. ఈ కథలలో కొన్నైనా ఆ విషయాన్ని బలంగా నిరూపిస్తున్నాయి.

— కె.వి. రమణారెడ్డి

---

శరత్ పూర్ణిమ : జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి కథలు - నవోదయ పబ్లిషర్సు విజయవాడ - 2, గుంటూరు - 2 1/8 డెమ్మీ viii - 282 పుటలు, వెల : రూ. 14

# ప్రజాస్వామ్య, పౌరహక్కులను రక్షించాలి!
# రాజకీయ ఖైదీలను బేషరతుగా విడుదల చేయాలి!

గత పదిహేను సంవత్సరాలు ఇందిరా నియంతృత్వ పరిపాలనకు వ్యతిరేకంగా పోరాడుతూ నిర్బంధాలకు గురియైన రాజకీయఖైదీలను ఆంధ్రప్రదేశ్‌లో కొత్తగాఏర్పడిన తెలుగుదేశంపార్టీ ప్రభుత్వం వెంటనే బేషరతుగా విడుదలచేయాలనీ, వీళ్ళంతా తమ స్వార్థంకోసంకాక ఒక సామాజిక ఆదర్శంతో ఉద్యమాలు నిర్మించినవారనీ ఒక మెమొరాండంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి ఆంధ్రప్రదేశ్ పౌరహక్కులసంఘం పౌరహక్కుల ప్రజాసమితి (పియుసిఎల్) విజ్ఞప్తిచేసాయి.

2. దాదాపుగా ఆంధ్రప్రదేశ్‌లోని వరంగల్, ఖమ్మం, కరీంనగర్, శ్రీకాకుళం జిల్లాల్లోని ఏజెన్సీ ఏరియాలన్నీ గత పద్నాలుగు సంవత్సరాలుగా 'కల్లోలితప్రాంతాల' చట్టంకింద పోలీసుక్యాంపుల ఫలితంగా తీవ్రనిర్బంధాన్ని ఎదుర్కొంటున్నాయి. ఇదికాకుండా చెన్నారెడ్డి హయాంలో కరీంనగర్ జిల్లాలోని జగిత్యాల, ముత్యాల, సిరిసిల్లా, వేములవాడ తాలుకాలుకూడ 'కల్లోలిత ప్రాంతాలు'గా ప్రకటించబడ్డాయి. పోలీసులు కల్పిస్తున్న భయోత్పాతాలు మినహా ఇక్కడ ప్రజలకు కలవరంకలిగించే స్థితి ఏమీలేదనీ ఎన్నో నిజనిరూపణ కమిటీలు ప్రకటించాయి

కనుక ఈ చట్టాన్ని ఉపసంహరించాలనికూడ ఈ మెమొరాండం డిమాండ్ చేసింది.

3. 1969 మొదలుకొని ఇప్పటివరకు 'ఎదురుకాల్పుల' పేరుతో 500 మంది విప్లవకారులను, సానుభూతిపరులను కాంగ్రెసు ప్రభుత్వం కాల్చివేసింది. 'ఎన్‌కౌంటర్ల'న్నీ పోలీసుహత్యలేనని భార్గవకమీషన్ ముందు తార్కుండే కమిటీ సాక్ష్యాధారాలతో నిరూపించిందికూడ. ఇందిరా పరిపాలనకాలంలో ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన ఇతర అన్యాయాలతోపాటు ఈ 'ఎన్‌కౌంటర్ల'పై కూడ న్యాయవిచారణజరిపి నేరస్తులను శిక్షించాలని ఈ మెమొరాండం కోరింది.

4. 1924లో బ్రిటిష్ వలసప్రభుత్వం కాన్పూర్ కుట్రకేసు పెట్టిననాటి నుంచీ రాజకీయ ప్రత్యర్థులమీద కుట్రకేసులు మోపడం ప్రభుత్వాలచేతుల్లో ఒక పిరికి ఆయుధమైంది. పార్వతీపురం కుట్రకేసుమొదలుకొని సికిందరాబాదు కుట్రకేసు వరకు, విప్లవకారులపై, సానుభూతిపరులపై, రచయితలపై ఎన్నో కుట్రకేసులను కాంగ్రెస్ ప్రభుత్వం బనాయించింది. వీనిలో విచారణ పూర్తిఅయిన ఏ ఒక్క కేసూ నిలవలేదు. తొమ్మిది సంవత్సరాలుగా సాగుతున్న సికిందరాబాదు కుట్రకేసుపై ప్రభుత్వం ఇరవైలక్షల రూపాయలు ఖర్చుచేసాక అసలు దానికి కేసుడైరీయే లేదని తేలి హైకోర్టు స్టేఇచ్చింది. ప్రభుత్వం కుట్రకేసులన్నీ బేషరతుగా ఎత్తివేయడం ప్రజాధనాన్ని ఇప్పటికైనా దుర్వినియోగంనుంచి కాపాడడమే అవుతుంది.

5. గ్రామాల్లో ప్రజలు తమ న్యాయమైన హక్కులకోసం ఉద్యమాలు చేపట్టినా, విద్యాలయాల్లో విద్యార్థులు భావవ్యక్తీకరణకోసం సభలు సమావేశాలు

జరుపుకున్న సహించని పోలీసులు గ్రామాలను, విద్యాలయాలను పోలీసుక్యాంపులుగా మార్చివేసారు ముఖ్యంగా వరంగల్ జిల్లా గ్రామాల్లో, వరంగల్ నగరంలో కెయుసి, సికెయం మొదలైన కాలేజీలలో ఇది ఏడాదిగా కొనసాగుతున్నది.

పరిపాలన పోలీసుల చేతిలో పెట్టి చట్టానికి గోరీకట్టిన ఈ పోలీసుక్యాంపులన్నిటినీ ఎత్తివేయాలనీ, భవిష్యత్తులో ఎక్కడాగూడ పోలీసుక్యాంపులు పెట్టకూడదనీ ఈ మెమొరాండం డిమాండు చేసింది.

6. ముఖ్యమంత్రి ఎన్టీఆర్ స్వయంగా ఇంద్రవెల్లి సంఘటనను 'ఓపెన్ ట్రాజెడీ' అని ఒప్పుకున్నాడు. కాని జలియన్‌వాలాబాగ్ దురంతాన్ని మరపించే ఇంద్రవెల్లి కాల్పులపైగానీ, పొలాలల్లో దున్నుకుంటున్న గిరిజనులపై కాల్పులు జరిపిన కొండమొదలు ట్రాజెడీపైగానీ ఆయన న్యాయవిచారణ ప్రకటించకపోవడం గ్లిసరిన్ కన్నీరుకార్చడమే అవుతుంది.

తమ మనుగడకోసం ఉద్యమిస్తున్న గిరిజనులపై ఈరెండు సంఘటనల్లోనూ నిష్కారణంగా కాల్పులు జరిగిన నేరస్తులను ఉన్నతస్థాయి విచారణజరిపి శిక్షించాలని ఈ సంఘాలు డిమాండు చేసాయి.

7. మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల కార్యకర్తలను, విప్లవకారులను రాజకీయ కార్యకర్తలుగా కాకుండా, ఒక ప్రత్యేకరకమైన నేరస్తులుగా పరిగణిస్తూ వీరిపై కేసుల విచారణకోసం నక్సలైట్ కోర్టులను, వీరిని వేటాడడంకోసం యాంటీ నక్సలైట్‌స్క్వాడ్‌లను ఏర్పాటుచేయడం చట్టవిరుద్ధమని, కనుక వీటిని రద్దుచేయాలనీ ఈ మెమొరాండం డిమాండుచేసింది.

8. పశ్చిమ బెంగాల్ త్రిపుర ప్రభుత్వాలవలె నాసా, ఎస్మాలవంటి కేంద్ర నల్లచట్టాలను తానుకూడ ప్రయోగించనని తెలుగుదేశంపార్టీ ప్రభుత్వం ప్రకటించాలని ఈ మెమొరాండం ఆశించింది.

9. జంటనగరాలలో 14 సంవత్సరాలుగా 144 సెక్షన్ అమలులోవున్నది. వరంగల్, నిజామాబాద్, నలగొండ పట్టణాలలో ఒకటిరెండు సంవత్సరాలుగా సెక్షన్ 144 రాకపోతే సెక్షన్ 30 సాకుతో సభలు, సమావేశాలకు ప్రజాస్వామ్య సంస్థలకు అనుమతినివ్వడంలేదు. ఈ సెక్షన్‌లను ఎత్తివేసి ప్రాథమిక హక్కులను పరిరక్షించాలనీ ఈ మెమొరాండం విజ్ఞప్తి చేసింది.

10. పోలీసు అత్యాచారాలకు సంబంధించి సెషన్స్‌జడ్జిచేత న్యాయవిచారణ జరిపించడానికి అవకాశం కల్పించేవిధంగా సిఆర్‌పిసిని సవరించాలనికూడ వీరుకోరారు.

ఈ డిమాండ్‌లతో మార్చి 19న హైదరాబాద్‌లో నిర్వహింపబడిన ప్రజా ప్రదర్శనలో. బహిరంగసభలో పదివేలమందికి పైగా పాల్గొన్నారు. సభలో బాల గోపాల్, కాళోజీ, నాయని నరసింహారెడ్డి, స్వామిఅగ్నివేష్ ప్రసంగించారు.

ఇంద్రవెల్లి మృతవీరుల సంస్మరణ స్థూపావిష్కరణసభ (ఏప్రిల్ 20)లో
నైజాంగుండెల్లో నగారా మోగించిన

## కొమురం భీం

(చారిత్రిక నవల)

సాహు – రాజయ్య

ఆవిష్కరింపబడుతుంది.

---

## అమరుడు కామ్రేడ్ దేవేందర్‌రెడ్డి

సంస్మరణ గీతాల సంకలనం వెలువడుతుంది.

కా॥ దేవన్న జీవిత విశేషాలు ఆయనపై పాటలు, కవితలు సృజన అడ్రెసుకు పంపించగలరు.

---

సాహిత్యపాఠశాల జనవరి '83 సందర్భంగా విరసం ప్రచురించిన
చెరబండరాజు రచనలు

**నా జీవిత రేఖలు** రూ. 2/-

**గ్రామాలు మేల్కొంటున్నాయి** నాటకాలు – నాటికలు రూ 8/-

**కత్తిపాట** పాటలు రూ. 4/-

---

వెలువడినవి.

**అనామకుడి డైరీ** కె. రాంమోహన్‌రాజు కథల సంపుటి రూ. 5/-

**సముద్రం** వరవరరావు రూ. 2/-

---

పై పుస్తకాలన్నీ సృజన వద్ద దొరుకుతాయి.

**SRJANA Telugu Monthly** Mar./April 83 H/HNK-3
Regd. No, with Registrar of Newspapers 10953/67

# ప్యారిస్ కమ్యూన్

చరిత్రను నిర్వచించడం కాదు
చరిత్రను నిర్మించిన విప్లవకారుడు
ప్రజల పరుగుకు వెనుకపడడు
పిండాన్ని ఆవిరిపోనివ్వడు

కనురెప్పలు విచ్చుకుని చూపు పథమై మొలకెత్తినట్లు
కమ్యూనార్డుల విజయం కమ్యూనిస్టుల స్వప్నం
స్వప్నమంత స్వల్పకాలమే
కాని ఎంత నిజమైన అనుభూతి
ఎంత సాహసోన్మేష ఆచరణ

అతడు కార్మికుడు అతడు కవి

ఆ లోకాన జైళ్ళు లేవు కోర్టులు లేవు
బయళ్ళ ప్రజాకోర్టులే తప్ప
సిపాయిలు లేరు
చిగురించిన ప్రజాస్వామిక విలువలు తప్ప

ప్రజలు ప్రజల్ని పాలించుకుంటే
అది పాలనకాదు. అది ప్యారిస్ కమ్యూన్

కమ్యూన్ వెన్ను విరగలేదు
కమ్యూన్ కన్ను మూయలేదు

కమ్యూన్ కమ్యూనిస్టు వ్యవస్థలో
కన్ను తెరుస్తుంది ఒళ్ళు విరుస్తుంది
చనిపోయినా నూరేళ్ళుగా చైతన్యంలో జీవిస్తున్న మార్క్స్
ప్రజల ఆలోచనల ఆయుధాల్తో
ఆయుధాల ప్రజాపక్షపాతంతో
మళ్ళీ వర్గపోరాటాల్లో తలఎత్తుతున్న
ప్యారిస్ కమ్యూన్ను
కంటికి రెప్పలా కాపాడుతాడు

**SRJANA** Single copy Rs. 2-00
**Hanumakonda 506001** Yearly Subscription Rs. 20-00